

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 23-8-

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

## ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **42**
సంచిక **51**

వికృతి సంవత్సర శ్రావణ శుద్ధ ఏకాదశి బుధవారము




**డిక్సన్‌పాట్లు:**—కాశ్మీర్ వివాదవిషయంలో మధ్యవర్తిగా వ్యవహరిస్తున్న సర్ ఓవెన్ డిక్సన్ ఇటీవల చాలాసార్లు ఢిల్లీ, కరాచీలమధ్య తిరిగాడు. (నేషనల్ హెరాల్డ్)

క్రమశిక్షణను, ఐకమత్యమును కళ్లారా చూచిన నేను, గతాన్ని వెక్కిరిస్తున్నట్లుగా యీనాడు జరుగుతున్న సంఘటనలను చూచి ఎంతగా ఆవేదనపడుచున్నానో దేశీయులు గ్రహించకపోరు" అని పటేలుగారు తమ విషాదమును వెల్లడించారు.

గతాన్ని వెక్కిరిస్తున్నట్లుగా ప్రవర్తించుచున్న మాటనిజమే. దేశములో అపారమైన స్వార్థత్యాగం చూపించినది కాంగ్రెసుపార్టీనాయకులు. అనేకసత్సంకల్పములను వెల్లడించినది కాంగ్రెసుపార్టీవారే. ప్రజానీకమునకు మార్గదర్శకులుగా సత్యసంధులై నడచెడివారే నాయకులు. ప్రజలకు తమయందు విశ్వాసంగాని గౌరవంగాని తగ్గుచున్నదా హెచ్చుచున్నదా అని పరిశీలించి చూసుకోవలసిన భారంకూడా నాయకులదే.

కాంగ్రెస్‌నాయకులు అనగా కాంగ్రెస్ అధిష్ఠానవర్గములో చేరిన పటేలుప్రభృతులు, శ్రీమాన్ రాజగోపాలాచారిగారు సహా భాషారాష్ట్రవిభజని అత్యంతావశ్యకముగా జరిగితీరవలెనని వాదించి అట్టి భాషాప్రాంతవిభజనమే ప్రజాప్రభుత్వమునకు ప్రాణప్రతిష్ఠ చేయగలదని బాహాటంగా ప్రకటించి, చిట్టచివరకు ఆంధ్రరాష్ట్రవిభజనమైనను తప్పక చేసెదమని చేతిలో చేయివేసి, ఆఖరుకు "గతమును వెక్కిరిస్తున్నట్లుగా నోటితో లేదనకుండా చేతితో లేదని ఆంధ్రరాష్ట్రాన్ని హుళక్కి మహంకాళి అన్నారు. పటేలుగారు చెప్పినమాట నిజం. పెద్దలుమొదలు చిన్నలవరకు "గతాన్ని వెక్కిరిస్తున్నట్లుగానే ప్రవర్తిస్తున్నారు. ఆనాటి గాంధీ-అనుచరులైన కాంగ్రెసు నాయకు లేరి? అనే శంక ప్రజలలో కూడా కలిగింది.

ఆ మాట నిజమే. సత్యం అనేది తప్పకుండా జయిస్తుంది. మనకు పరిస్థితులు జయప్రదంగా లేవంటే సత్యం విడిచి ప్రవర్తించడమే కారణం. పలికినట్లుగా తాను పనులు చేయడమే సత్యం. అదే జయించును.

ఇది ప్రజారాజ్యంగనుక ప్రభుత్వచక్రమందు ఏమైనా లోపము లున్నట్లయితే వాటిని ప్రజలే దిద్దుకోవాలి అనిన్నీ, ఆ లోపాలను దిద్దుకొనలేకపోతే ఆ లోపం ఆ పాపం, అంతా ప్రజలదే అనిన్నీ వాదించడం కేవలం యుక్తివాదన. పటేలుగారు తమ సందేశంలో ఒక్కమాట అన్నారు. "కర్ణధారులమై కల్లోలజలధినుండి రాజ్యనౌకను సురక్షితంగా తీరం చేర్చామని గట్టిగా చెప్పగలను" కాబట్టి కష్టాలను గట్టెక్కించిన కర్ణధారులలో తాను చేరియున్నానని నిర్వచించారు. కాబట్టి యింతవరకూ కష్టాలను గట్టెక్కించినందుకు రావలసిన గౌరవం కర్ణధారులైన తమకు రావలసియున్నదన్నారు. కనుక, స్వాతంత్ర్యం లభించి మూడేళ్లు గడచినపిమ్మట యిప్పుడు దేశంలో జటిలక్లిష్టభూయిష్టపరిస్థితులు ఆందోళనకరంగా ఏర్పడియున్నందుకు ఆ బాధ్యత కూడా కర్ణధారులదే. దేశంలో ఉన్న ముఖ్యక్లిష్టసమస్యగా ఆర్థికసమస్య ప్రత్యక్ష మౌతోంది. దేశానికి అన్నవస్త్రములలోపము లేకుండా చేయుటకుగాను అధికారవర్గమున్నూ ఐశ్వర్యవర్గమున్నూ పరస్పరం త్రికరణశుద్ధిగా తోడ్పడి పనిచేయవలసియున్నది.

మన కర్ణధారులను మనమే స్తోత్రపాఠం చేసికొనుటకంటె యీ సమయంలో యీ జటిలసమస్యల మూలహేతువులను విమర్శించుట యుక్తము.

# విషయానుక్రమణిక

## 23 ఆగస్టు 1950





# ఆస్థానకవి

మత్తేభదానోత్థానము



[శ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి]

ప్రకటానర్గళవాక్ప్రచారముల నాంధ్రక్ష్మాతలంబందుఁ, గౌ
శికగోత్రుం డెవఁ డెన్నికం బడసె, నా శ్రీపాదవంశ్యుండు, కృ
ష్ణకవీంద్రుం డిల మన్కి నందుతఱి, నాస్థానంబునం దెక్కె, వే
ఱొకఁ డర్హుండగు నెట్టు? లన్న నగునే? యుబ్బుఁ దలూఁగించినన్.

*　　*　　*

ఇతిహాసంబు లవెన్ని యన్నియును దానే పల్కె నేవృద్ధు, త
త్స్మృతి మన్వ్యాఖ్యునిఁగాక, యాంధ్రమున సమ్మాన్యుండుగా నెంచ, సం
చితవాక్ప్రాతురు లెన్నియున్నఁ గవితాశ్రీపాదులే యైనఁ, గీ
ర్తికి నెక్కె, స్మృతి కెక్కె నౌన చరితార్థీభూత మిట్లౌటకున్.

*　　*　　*

ప్రతిభాఢ్యు ల్గల రెందఱే నిలఁ గవుల్ భాషాంగనాసేవకుల్
వెతకం గృష్ణునిఁ దక్క నేఱొకని నీ విశ్వంభరం గందుమే?
శతకావ్యైకవిధాత నాంధ్రకవితాసామ్రాజ్యపట్టాభిషి
క్తతకుం బద్యసహస్రషష్టికమహాగ్రంథంబు సంధింపఁగన్.

*　　*　　*

పటువాక్ప్రౌఢిమ మింపుఁ బెంపెసఁగ విద్వద్వర్ణ్యవాగ్దేవతా
నటనోద్దీపితసత్ప్రబంధరచనానందంబు నందించు న[illegible]
ద్భటసత్కీర్తిసుధానిధాన మగు నా ధన్యుం గవీడ్గణ్యు, వేం
కటయాజ్యాగ్రతనూభవు న్నిలుపుట న్గణ్యంబు పీఠంబగున్.

*　　*　　*

వికృతి న్నేఁ డిటు లగ్రపీఠమున నీ విద్యావయోవృద్ధునిన్
సుకృతి న్నిల్పుట వైకృతంబునఁ గృతుల్ సొంపారఁగాఁ బల్కనో!
ప్రకృతం బేమగుఁగాక, యాతనికి దీర్ఘాయుస్సు నారోగ్య మి
చ్చి, కృపాళుండు పరాత్పరుండు మనుచున్ సిద్ధింప నిష్టార్థముల్.

నూతన ఆంధ్ర ఆస్థానకవి

# శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిని ఆంధ్ర ఆస్థానకవిగా నియమింపవలసిందంటూ, అందుకై నియమింపబడిన సలహాసంఘం ప్రభుత్వానికి సిఫారసుచేస్తూ ఏకగ్రీవంగా తీర్మానించింది.

మహామహోపాధ్యాయేత్యాదిబిరుదాంకితులు కళాప్రపూర్ణ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని మద్రాసుప్రభుత్వం ఆస్థానకవిపట్టప్రదానంతో గౌరవింప నిశ్చయింపనున్నదన్న వార్త ఆంధ్రావనికంతటికీ సంతోషావహం. శ్రీ శాస్త్రిగారు శతాధికగ్రంథకర్తలై ఆంధ్రదేశంలో అంతటా ప్రసిద్ధిగన్న సారస్వతమూర్తులు.

శ్రీ శాస్త్రిగారు వెలనాటి వైదిక బ్రాహ్మణకుటుంబంలో జన్మించారు. తండ్రి వేంకటసోమయాజి. తల్లి వెంకటసుబ్బసోమిదమ్మ. వీరు ఎర్నగూడెము వద్ద నున్న దేవరపల్లిలో 29-10-1866 వ సంవత్సరంలో జన్మించారు. కవితాలవాలమైన రాజమహేంద్రవరం వీరి నివాసస్థానము.

వీరు సుమారు 150 గ్రంథాలు రచించిన నిరంతరవాఙ్మయవ్రతులు. ఇప్పటికీ వీరు నిత్యము కవితావ్యాసంగం చేస్తూనే వున్నారు.

వీరి రచనలలో స్వతంత్రకావ్యాలు అనువాదాలు, నాటకాలు, గద్యరచనలు విరివిగా ఉన్నాయి.

కవిసార్వభౌములు సంస్కృతాంధ్రాలలోను వ్యాకరణాది శాస్త్రాలలోను, వేదవిజ్ఞానంలోను కూలంకషమైన పాండిత్యం గడించిన ఘనులు. ఈ క్రిందివి వీరు రచించిన శతాధికగ్రంథాలలో ముఖ్యమైనవి. 1. శ్రీకృష్ణమహాభారతము, 2. రామాయణము, 3. గణేశపురాణము, 4. బొబ్బిలియుద్ధనాటకము, 5. వేణీసంహారము, 6. కలభాషిణి, 7. శ్రీ రాజభక్తి, భోజరాజవిజయము 8. శ్రీనాథకవిజీవితము, 9. గౌతమీమాహాత్మ్యము, 10. సత్యనారాయణోపాఖ్యానము, 11. గజాననవిజయము, 12, శ్రీకృష్ణకవిరాజీయము, 13 సావిత్రీచరిత్రము, 14. సంస్కృతకవిజీవితములు 15. కాళిదాసవిలాసము, 16. తెనాలి, రామకృష్ణ చరిత్రము. ఆంధ్రజాతికి మహాభారతము జీవగఱ్ఱవంటిది. జాతిసాంస్కృతికజీవితం అంతా ఈ మహాగ్రంథంలో ప్రతిబింబితమైనది. కవిత్రయం సుమారు రెండువందల సంవత్సరాలు పరిశ్రమిస్తేకాని ఈ పెన్నిధిని ఆంధ్రుల కందించలేకపోయినారు. కవిత్రయరచన స్వేచ్ఛాప్రజ్ఞాప్రసన్నమైనది. ఈ కవులు భగవద్గీతాదితాత్త్విక

**శ్రీ పి. గణపతిశాస్త్రి**

గ్రంథాలను అనువదించకుండానే విడిచివేశారు.

కళాప్రపూర్ణులు ఒక్కచేతిమీదుగా ఇంచుమించుగా 15 సంవత్సరాలలో మహాభారతం అంతా యథామూలంగా రచించి, అఖండయశస్సును ఆర్జించుకొన్నారు. సంస్కృతానభిజ్ఞులయిన ఆంధ్రులకు మూలమాధుర్యము, మాహాత్మ్యము స్ఫురించి చూపించడానికి వీరి మహాభారతసహాకారము అత్యంతావసరము. ముత్యాల సంస్థానాధీశ్వరులు శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదరావుగారును భారత కృతి స్వీకరించారు. పాలకొల్లువాస్తవ్యులు శ్రీరేపాక సత్యనారాయణమూర్తి, చుండూరు నారాయణరావు గార్లు భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తికాది పర్వాలు కృతితీసుకున్నారు. కవిత్రయంతరవాత మహాభారతం అంతా ఆమూలాగ్రంగా ఆంధ్రంలోకి సంతరించిన భాగ్యం శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి కొక్కరికే దక్కింది.

భారతప్రభుత్వం వీరి నిదివరకే మహామహోపాధ్యాయబిరుదుతో సత్కరించింది. ఆంధ్రవిశ్వవిద్యాలయం వీరిని కళాప్రపూర్ణబిరుదుతో గౌరవించింది.

శాస్త్రిగారు పత్రికాసంపాదనలో కూడా బాగా ఆరితేరినవారు. మొదట వీరు 'కళావతి' అనే ముద్రాలయము చెన్నపురిలో నెలకొల్పారు. తరవాత దీన్ని రాజమహేంద్రవరానికి మార్చి అవిచ్ఛిన్నంగా 10 సంవత్సరాలవరకు నడిపించారు. మొదట వీరు 'గౌతమి' అనే పత్రికను స్థాపించి ఇంచుమించుగా ఒక సంవత్సరం నడిపించారు. ఆ తరవాత కొంతకాలము 'మానవసేవ' 'వందేమాతరం' అనే పత్రికలు కూడా నడిపించారు. తరవాత 'వజ్రాయుధము' అనే పత్రిక స్థాపించి దానిని సమగ్రతతో నిర్వహించారు.

వీరికి అనేకపర్యాయములు కనకాభిషేకాదిమహాసత్కారాలు జరిగాయి.

వీరి షష్టిపూర్తిమహోత్సవం జరిగినప్పుడు బాల్యంలో వీరివద్ద విద్యాభ్యాసం చేసిన కింకవీంద్రఘటాపంచాననులు చెళ్లపిళ్లకవి గండపెండేరంతో స్వయంగా వీరిని సన్మానించారు. చెళ్లపిళ్లవంటి మహాకవిశిష్యత్వం గడించుకొన్న శాస్త్రిగారి భాగ్యం అనితరసాధారణం.

ఇంకా అనేకులు వీరికి శిష్యులై కవులై ఆంధ్రంలో ఖ్యాతిగడించుకొన్నారు. ఆధునాతనకవులు శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు కొంతకాలం వీరిదగ్గర విద్యాభ్యాసం చేశారు.

శాస్త్రిగారు వయస్సులో వృద్ధులయినా కవితావ్యాసంగంలో నిత్యయౌవనులే. వారు ఇంకా మహారచనలు చేస్తున్నారు. ఇంకా ముందుముందు వారి లేఖినినుండి అమరరచనలు వెలువడగలవనీ పరమేశ్వరుడు వారికి చిరాయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించగలడనీ ఆశిస్తున్నాము.

# మనదేశం

## భూకంపం *

స్వాతంత్ర్యోత్సవాల సంరంభానికి ముందు తుఫాన్ ఎక్స్‌ప్రెస్‌కి ప్రమాదమూ, తరవాత అస్సాం భూకంపమూ సంభవించాయి. రైలుపట్టాల సీలల్ని ఎవరో లాగేసినందువల్లనే ఎక్స్‌ప్రెస్ ప్రమాదం మొఘల్ సెరాయ్ సమీపంలో సంభవించింది. 29 మంది చనిపోయారని అంచనా.

అస్సాంలో భూకంపం బీహార్ క్వెట్టా భూకంపాలకంటె తీవ్రంగానే వచ్చింది. ప్రాణనష్టం స్వల్పమే అయినా ఆస్తినష్టం అపారం. 1897 అస్సాం భూకంపం తరవాత ఇంతవరకూ ఎక్కడా ఇంత తీవ్రంగా సంభవించలేదు. ఏపాటి కొద్ది భూకంపం ఎన్ని వేల మైళ్లదూరంలో సంభవించినా సూచించే యంత్రాలు బొంబాయి కలకత్తాలలో ఈ భూకంపం తీవ్రతకి ఆగలేక చెడిపోయినయ్.

వచ్చిన భూకంపం వచ్చి ఇదివరకు మాదిరిగా పోక రోజులతరబడి అడపాదడపా వస్తూనేవుంది. టిబెట్‌లో ఏమూలో ఇది పుట్టివుంటుందని అంచనా వేస్తున్నారు. ఈ తరఅస్సాంలో మొదటిసారి అయిదు నిమిషాలు మూడోసారి ఏడు నిమిషాలువుంది. బర్మా సరిహద్దుకూడా కొంచెం కదిలినా ప్రమాదం కాని, నష్టం కాని సంభవించలేదు. కాని ఒకసారి మాత్రం పెద్ద ఫిరంగి పేలినంత పెద్ద వింతధ్వని వినిపించిందట.

రావడంలోనే ఉధృతంగా వచ్చినందువల్ల నేల కదిలిపోయి క్రమంగా సద్దుకోడానికి వ్యవధిపడుతోందట. ఆదివారం తరవాత వచ్చిన భూకంపాలన్నీ ఈ సద్దుకోడం లక్షణాలే నని తెలిసినవారు చెప్తున్నారు.

ఫలితం ఎగువఅస్సాంకి దిగువఅస్సాంకి మార్గం లేకుండా విడిపోయినాయ్. తంతి మార్గాలుకూడా లేకుండా పోయినయ్. అనేక వేల ఇళ్లు కూలిపోయినాయి. డిబ్రుగర్ - గౌహతీలమధ్య ట్రంక్‌రోడ్డు రెండు మైళ్లు అజాపజా లేకుండా కుంగిపోయిందట. అక్కడక్కడ 6 అడుగులు, 12 అడుగులు కూడా కుంగిపోయింది. డిగ్‌బోయ్ పెట్రోల్ నూతుల కేమీ నష్టం వాటిల్లలేదు. సరిగదా ఒకచోట నేల పెద్దనెరద పడి, అందులోంచి నూనిఊట దానంతటది పైకి వచ్చి పడుతోందిట. చాలాచోట్ల రైలుకట్టలు కుంగిపోయాయి. ఒకచోట ఇరవయ్యడుగులవరకూ నేల కుంగిపోయి. రైలుపట్టాలు కొబ్బరాకుల్లాగా వేలాడుతున్నాయిట. అన్ని ప్రాంతాల్లోకీ లక్కింపూర్, జోర్‌హట్, డిబ్రుగర్ ప్రాంతాలలో ఎక్కువ నష్టం, నేలలో ఎక్కువ మార్పులూ సంభవించాయి. 16 వ తేదీని ఒకచోట కొండచరియలో ఇరవై మంది కూలీలు పనిచేస్తుండగా ఉన్నట్టుండి నేల చీలిపోయి అందరూ మళ్ళీ కనిపించకుండా మాయమైపోయారన్నారు. ఏం జరిగిందో సరిగా తెలియదు.

బ్రహ్మపుత్రానదిలో నీటిమట్టం లేస్తోంది. జరిగిన నష్టం చాలక పెద్దవరదలొస్తాయేమోనని కూడా భయపడుతున్నారు.

ఇంతే కాదు, ప్రవాహవేగం అధికమయింది. నీరు గంధకపువాసన కొడుతోందిట. చేపలు నీళ్ళలో ఉండలేక గట్ల మీదికి దూకేస్తున్నాయట. డిబ్రుగర్ నగరం ప్రతిరోజూ భూకంపాలకి కదిలిపోతోంది. నాలుగో రోజుని, అంటే శనివారం నాడు, ఎనిమిది మార్లు కంపించింది. ప్రక్కనే ఉన్న డిబ్రునది పొంగుతోంది. నగరానికి దిగువ ప్రాంతంలో పెద్ద పెద్ద రాళ్లు నదికి అడ్డంగా పడ్డాయట. ఆదిగువని నీళ్ళు రాక నది ఇంకిపోతోంది. బ్రహ్మపుత్రానదిలో చేపలు పట్టుతున్న 20 మంది పల్లెవాళ్లేమైపోయారో అతీపతీ లేదు. డిమ్‌డోమా పట్టణంవద్ద నేల 30 అడుగులు కుంగిపోయింది. డిహాంగ్‌నది నీ రెండిపోతోంది. అంటే ఎగువ నెక్కడో వరద లొస్తాయన్నమాట. తేయాకుతోట లున్న జోర్‌హట్ కూడా వరసగా రోజూ కంపిస్తున్నా తెల్లవాళ్ల అదృష్టంకొద్దీ తోటల కాస్తే చెప్పుకోదగిన నష్టం కలగలేదట.

షిల్లాంగ్ కేంద్రపూరీ కాదన్నట్లు ఎగువ అస్సాం అంతటా రోడ్లు చాలావరకూ పాడైపోయాయట. రోడ్లు పొట్లుచీలి విచ్చిపోయాయట. ఎక్కడేం జరిగిందీ, ఎంతమంది చనిపోయిందీ, ఎంతమంది మిగిలిందీ వార్త లేవీ రావడం లేదు. విమానాలమీద మనుషుల్ని పంపి పరిశీలించడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తోంది.

అంటే కరువులు సంభవించడానికీ, అన్ని వస్తువుల ధరలూ పెంచడానికీ మరో కారణం దొరికిందన్నమాట. ఈయేడు జాబితాలో సర్కార్ల తుఫాన్లు, తమిళనాడు అనావృష్టి, కొరియాయుద్ధాలకి ఇంకో తమ్ముడు అస్సాంభూకంపం పుట్టాడు. పిదపకాలమని ముసలమ్మలూ, పాపం హిమాలయాల్ని కూడా మించి పెరిగిపోయి పేరుకుంటోందని ఓమండూరివారూ చెప్తారు. హిమాలయాల్లో గౌరీశంకరశృంగం కంటె ఎత్తైన మరో శృంగం ఉందని అనుమానం. ఇది ఎక్కడనించి చూసినా కనిపించదుట. విమానంమీద వెడుతుంటే ఎవరో కొందరు పుణ్యాత్ములకిమాత్రం కనిపించిందిట. దాన్ని వెతికిపట్టుకోవాలని పాతికేళ్లు నిండని ఇద్దరు అస్ట్రియన్ విద్యార్థులు బయలుదేరారు.

ఎక్కడ ఎవరివల్ల ఏపాపం పెరిగిందో తెలియదు కాని వస్తువుల ధరలుమాత్రం గౌరీశంకరశృంగాన్ని మించి పెరిగిపోతున్నాయి. ఏదో బద్ధకంకొద్దీనో లేక మళ్లీ స్వాతంత్ర్యోత్సవాలొచ్చాయి మేలుకోవాలనో భూదేవత ఒళ్లు విరుచుకుందేమో అస్సాంలో భూకంపం వచ్చిందనుకోవచ్చు. లేకపోతే టిబెట్‌లో చీనా కమ్యూనిస్టులు ప్రవేశిస్తున్నారనే వార్తలవల్ల అస్సాం దూరంగా ఉండటం మంచిదని కొంచెం జాగా జరిగి ఉండవచ్చు. ఏదికారణమైనా అస్సాంప్రాంతం అంతా ఇకమీదట కొత్తగా ఉంటుందిట. అంటే లేనిచోట్ల గట్టులేర్పడటం, ఉన్నచోట్ల కుంగి నేలతో చదునై పోవడం, ఒకొక్కచోట చెరువులూ సరస్సులూ పుట్టడం, నదులూ కాలవలు కొత్తదార్లు తొక్కడం మొదలైనవి సంభవిస్తాయన్నమాట. అలా జరగవచ్చని కొందరు శాస్త్రజ్ఞులు చెపుతున్నారు.

ఇదేదీ తూర్పుబెంగాల్ సరిహద్దులో జరగలేదు. అదీ కొంత నయమే. అక్కడే జరిగితే ఆ నేలంతా తమ కొప్పగించాలని అల్లా కోరుతున్నాడనీ కాబట్టి ఆనేల తమ కివ్వాలనీ పాకిస్తాన్ పేచీపెట్టినా వింత లేదు. అమస్సర రష్యల్లు పర్షియా సరిహద్దులో ఒకనదికి అడ్డకట్టలు వేసి ప్రవాహమార్గాన్ని మార్చి కొంత నేల నాక్రమించుకున్నారని వార్త వచ్చింది.

## వస్తువుల నిలవలు - ధరలు*

ముందేమొస్తుందో అనే భయంవల్లగాని,



తమ గడియారమూ, కలమూ ఎవరో దొంగిలించుకొని పోయినారని డాక్టరు పట్టాభిగారు పోలీసులకు ఫిర్యాదుచేశారు. నేరస్థునికై గాఢమైన అన్వేషణ జరుగుతున్నది. (శంకర్స్ వీక్లీ)

ధరలు పెంచేసి చేతికొచ్చినంతవరకు ఎక్కువ లాభాలు గుంజెయ్యాలనికాని వస్తువుల్ని నిలవచేసేవారిని కఠినంగా శిక్షించటానికి పార్లమెంటు ఒకశాసనం చేసింది.

ఈ ప్రకారం అక్రమంగా ఆహారవస్తువుల్ని నిలవచేసేటట్లయితే, ప్రభుత్వం ఆ నిలవను స్వాధీనంచేసుకుని, ఆ నిలవల ఖరీదుకి 20 రెట్లు జరిమానా, ఏడేళ్లు ఖైదు విధిస్తారు. బట్టలు మొదలైనవైతే వారికి ఖైదు మాత్రమే విధించబడుతుంది. వ్యాపారులికిది చాలా యోగ్యమైనదని శాసనసభ్యున్నారు. అయితే చిక్కేమిటంటే, నిలవల చేసేవారి నెల్లా పట్టుకోడం? ఎల్లా పట్టించడం? ఎవరు పట్టిస్తారు? మనరాష్ట్రంలో ధాన్యసేకరణ, ఉద్యోగుల్లో అవినీతినిర్మూలన ఈపద్ధతుల్లోనే నడుస్తే ఈ శాసనంకూడా ఆట్టే ప్రయోజనకారి కావడం కష్టం. చిల్లర-చింతపండుదుకాణదారుని పట్టుకుని ఇరవై పావలాలు జరిమానా విధిస్తే ఏమైనట్లు? వారూ వీరూ అనే భయం పతుపోతుం. లేకుండా శాసనాన్ని అందరికీ సమానంగా అమలు జరిపితేనే ప్రయోజనం ఉంటుంది.

ఇంతే కాకుండా ధరల పెరుగుదలని అరికట్టడానికిగాను ఢిల్లీప్రభుత్వం త్వరలో ఆర్డినెన్సులు జారీచెయ్యడానికి సిద్ధపడుతోంది. ఈ విషయమై సర్వరాష్ట్రముఖ్యమంత్రుల సమావేశం ఢిల్లీలో ఈ వారం చర్చించింది. యుద్ధకాలం అక్రమలాభాల నిలవల నరికట్టడానికి జారీచెయ్యబడిన శాసనంవంటిదే తయారౌతోందిట. అంటే ధరల్ని నిర్ణయించి దుకాణదార్లందరూ ఆ ప్రకారమే అమ్మి, అమ్మే ప్రతి వస్తువుకీ బిల్లులు రసీదులు ఇవ్వాలని నిర్బంధం విధిస్తారన్నమాట-ఏవ రెంత ప్రమాణం కంటె అధికంగా ఏవస్తువుల్ని నిలవచెయ్యకూడదో నిర్ణయించబడుతుంది. సరుకు దగ్గర పెట్టుకుని అమ్మడానికి నిరాకరించే వర్తకులకి శిక్ష విధించబడుతుంది. ప్రస్తుతం రాష్ట్రప్రభుత్వాల ఆధ్వర్యంకింద నిర్వహించబడుతున్న వ్యావసాయికోత్పత్తి వస్తువుల ధరల నిర్ణయం తదితరనిర్బంధాలూ దేశానికంతకీ సమానంగా వర్తించే విధంగా కేంద్రప్రభుత్వం పైశాసనంలోనే ఏర్పాటు చెయ్యాలని బొంబాయిప్రభుత్వం కోరింది. ధాన్యాలు, పత్తి, జనుము, అపరాలు, నూనిగింజలు మొదలైనవికూడా కేంద్రప్రభుత్వం కంట్రోల్ శాసనాల్లో చేరితేగాని, ఇతర వస్తువుల ధరల్ని పెరక్కుండా ఆపడం కష్టమని వారి అభిప్రాయం.

ధాన్యసేకరణవిషయంలోనూ, ఆహార వస్తువుల కంట్రోల్ విషయంలోనూ కూడా అన్నిరాష్ట్రాల్లోనూ ఒకే విధానం అమలు జరిపే విషయమై ముఖ్యమంత్రులు ఢిల్లీలో చర్చిస్తున్నారు.

## అమ్మకపు పన్ను *

ఇక్కడింకో విషయంకూడా చెప్పాలి. గడిచిన సంవత్సరం వస్తువుల ధరలు పెరగడానికికల ముఖ్యకారణాల్లో అమ్మకపుపన్ను కేంద్రప్రభుత్వం ఒద్దిలో ఉన్న కొన్ని సరుకులికి తప్ప భూమిమీద ఉన్న అన్ని వస్తువులికీ వ్యాపించడం ఒకటి. కూటికవసరమైన వస్తువులపైన అమ్మకపు పన్ను విధించకూడదని కేంద్రప్రభుత్వం సలహా ఇస్తే దాన్ని మంత్రి గోపాలరెడ్డిగారు లక్ష్యపెట్టలేదు. మద్రాసుప్రభుత్వానుగడ అమ్మకపుపన్నుపైనే ఆధారపడి ఉందన్నారు. అది వారికి కామధేనువన్నారు. ఈ పన్ను ఆహారవస్తువులపైన విధించరాదని రాజ్యాంగం నిర్బంధం విధించింది. ఆ నియమాన్ని వచ్చే యేడాదినించి పాటించగలరన్నారు. ఇప్పుడు తమ కామధేనువుతో కేంద్రప్రభుత్వం ప్రమేయం కలిపించుకుంటే ఊరుకోబోరని ఒక మహిళాసభలో బల్లగుద్ది చెప్పారు. అందరిదీ తలొక దారి అయినందువల్లనే ధరల్ని తగ్గించడంలో కాని మరో కార్యక్రమంలో కాని ప్రభుత్వాసమర్థత బైటపడిందంటే ఆశ్చర్యం లేదు.

# నేటి ప్రపంచం

## కొరియా సమస్య *

ఐక్యరాజ్యసమితి భద్రతామండలికి రష్యన్ ప్రతినిధి అధ్యక్షతకాలం పది రోజుల్లో అంతం కానున్నప్పటికీ, ఇంతవరకూ కొరియాసమస్యపై విషయచర్చ జరగలేదు ఉత్తరకొరియన్ ప్రభుత్వప్రతినిధిని కూడా చర్చలకు పిలవాలని రష్యా చేసిన ప్రతిపాదనకు ఆంగ్లో అమెరికన్ వర్గం అంగీకరించలేదు

ఈలోగా కొరియాసమస్య పరిష్కారం నిమిత్తం అగ్రరాజ్యాలైదూ మినహా మిగతా ఆరుదేశాల (భారతదేశం, ఈజిప్టు, యుగోస్లావియా, నార్వే, ఈక్వెడార్, క్యూబా) ప్రతినిధులూ ఒక కమిటీగా ఏర్పడి కృషి చెయ్యాలని భారతప్రతినిధి శ్రీ బి. యన్. రావుగారు ఒక సూచనచేశారు ఈసూచన పట్ల అగ్రదేశాలలో ఫ్రాన్సు మినహా మిగతా నాలుగు దేశాలూ (అమెరికా, రష్యా బ్రిటన్, కొమింటాంగ్ చీనా) ఎట్టి అభిప్రాయాన్నీ ప్రకటించలేదు. రష్యన్ ప్రతినిధికి మాస్కో ప్రభుత్వం అభిప్రాయం ఇంకా తెలియలేదు. మిగతా ఆరుదేశాలూ ఆమోదించగలవని వార్తలు వస్తున్నాయి. ఫ్రాన్సు సుముఖత ప్రకటించింది. కాని అగ్రరాజ్యాల వైఖరి సుముఖంగా ఉండబోదనే విషయం వేరే చెప్పనవసరంలేదు. బహిరంగంగా విముఖత ప్రకటించకపోయినా, వాని ప్రమేయంలేక చిన్న రాజ్యాలేమీ చేయజాలవు.

కాని ప్రభుత్వాలధోరణి ప్రజల ధోరణి క్రమక్రమంగా వేరు వేరౌతున్నాయి. అనేక దేశాల్లో ప్రజాభిప్రాయం భారతప్రతినిధి సూచనలకు సుముఖంగా ఉంది

## పసిఫిక్ రక్షణ *

పసిఫిక్ సముద్రతీరప్రాంతదేశాలలో జాతీయప్రభుత్వాలు, యూరోపియన్ వలసప్రభుత్వాలు కల దేశాలను కమ్యూనిస్టుల బారినుండి రక్షించే బాధ్యత అమెరికా తరువాత తనదే నని ఆస్ట్రేలియన్ విదేశాంగమంత్రి పెర్సీస్పెండర్ ఈమధ్య అన్నాడు. అంటే బ్రిటన్ బాధ్యత ఆస్ట్రేలియా తరువాతనే ఇందుకు ఆస్ట్రేలియాకు అమెరికా ప్రాబల్యం ఉంది వాస్తవానికి మలయా ఆఫ్రికా వలసల్లో తప్ప, బ్రిటిష్ కామన్వెల్తు, వలసరాజ్యా లన్నిటా రక్షణబాధ్యతగాని, ఆర్థిక సైనిక సహాయమిచ్చే బాధ్యతకాని బ్రిటన్ హస్తాలనుంచి ఏనాడో అమెరికా అధీనమయింది. ఈ బాధ్యతని అమెరికా ఆస్ట్రేలియావల్ల నిర్వర్తించ దలుచుకుంది

ఈ బాధ్యత ఎలా నిర్వర్తించదలిచారనేది వేరే విషయం. మచ్చుకి ఇండోనీషియా చూడవచ్చు. ఇండోనీషియా రక్షణకు అమెరికా నౌకాసహాయ మివ్వగలదని ఇండోనీషియన్ ప్రభుత్వం భావించింది కాని యుద్ధంనిమిత్తం సురబాయా నౌకాశ్రయాన్ని వాడుకోడానికి మాత్రమే అమెరికా అడుగుచున్నది మిలిటరీ స్థావరాల నివ్వాలని మాత్రమే కోరింది కాని రక్షణబాధ్యతను వహించజాలదని అమెరికన్ ప్రభుత్వం స్పష్టపరిచింది. వీరికి స్థావరాలిచ్చి, యుద్ధంలో వీరి శత్రువుల దాడులికి గురైనప్పుడు రక్షణకు వారిపై ఆధారపడకూడదన్నమాట భారతదేశంలో ఫ్రెంచి, పోర్చుగీస్ పాలిత ప్రాంతాల్ని భారతీయులకొప్పగించకుండా వారి అదుపులోనే ఉంచుకోవాలని రహస్యంగా ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాలకు రహస్యంగా అమెరికా ప్రోత్సహించడానికి కూడా ఇదే అంతర్యం

ఏమైతేనేం పసిఫిక్ ప్రాంతరక్షణ కూడాను ఆస్ట్రేలియన్ ప్రధాని మెంజీస్ అమెరికన్ సైన్యాధిపతి జనరల్ మెకార్థర్‌తో సంయుక్త రక్షణఒడంబడిక చేసుకున్నాడు.

## కొరియాయుద్ధం *

కొరియాలో కొనసతున్న అమెరికన్ సప్లై కేంద్రం ఫూసాన్ రేవుకి చుట్టూ 50 మైళ్ళదూరంలో ఇరుపక్షాలూ నిలిచి. పోరాడుతున్నాయి అమెరికన్ సేనలు పలాయనం మాని నిలదొక్కి పోరాడుతున్నాయి తూర్పుతీరాన పొహాంగ్ రేవు తిరిగి దక్షిణకొరియన్, అమెరికన్ సేనల వశమయింది దక్షిణాన చింజూసమీపంలో పోరాటం సాగుతోంది. ఆనగరాన్ని ఆక్రమించుకోవాలని అమెరికన్ సేనలు పదిరోజులుగా చేస్తున్న యత్నం ఇంకా ఫలించలేదు.

ఫూసాన్ ప్రాంతంలో కూడా పోరాటం జరుగుతోంది. నక్టాంగ్ నదిని దాటి, ఫూసాన్ రేవును రక్షిస్తున్న అమెరికన్ దళాల వ్యూహాన్ని ఛేదించిన కమ్యూనిస్టు సేనలు అట్టే ముందడుగు వెయ్యలేకపోతున్నాయి టెగూనగరానికి విపరీత ప్రమాదం ఆసన్నమై తప్పిపోయింది ఈలోగా దక్షిణకొరియన్ ప్రభుత్వం టెగూనగరాన్ని విడిచి ఫూసాన్ నగరం చేరింది. టెగూనగరం ఇంకా అమెరికన్ సేనల అధీనంలోనే ఉంది మళ్లీ ఏక్షణంలో కమ్యూనిస్టుసేనలు ముందుకు వచ్చినప్పటికీ నగరాన్ని ధ్వంసం చెయ్యడానికి అమెరికన్ సేనలు సిద్ధంగా ఉన్నాయి నక్టాంగ్ నదిని దాటిన ఒక కమ్యూనిస్టుదళాన్ని పూర్తిగా నాశనం చేసినట్లు అమెరికన్లు చెప్పుకుంటున్నారు మళ్లీ మాసం వచ్చేసరికి యుద్ధగతి అటో ఇటో తేలిపోవచ్చును ఈలోగా కొరియన్ పట్టణాలు, గ్రామాలు వందలాదిగా అమెరికన్ బాంబులికి గురై ధ్వంసమౌతున్నాయి [సూర్యనారాయణ]

కథానిక:

# "కాంతాకనకాలు"

(గతసంచిక తరువాయి)

## శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

జీవజంతువులు సకల ప్రాణుల యొక్క చలనం సంభించిపోయిన ఆ ఒంటి గంటసమయాన నాలుగురోడ్ల కూడలిలో ఒక జట్కావాడు బండి లోపలి ఆడవాళ్లతో పేచీలు పెడ్తున్నాడు.

"అంత యిల్లెక్కడో తెలియనిదానివి ఎందు కెక్కావమ్మా బండి?' అంటూం డగా అందులోని విధవరాలు 'మా చక్రధర రావు కీ వూరినిండా ఎరుగున్నవాళ్ళేగదా, ఎక్కడ దిగినా చెప్పకపోతారా అని వచ్చాం నాయనా. మా అల్లుడు చాలా పలుకుబడి గల మనిషి. ఈ చుట్టుపట్లలో ఎవర్నడిగినా చెబుతారు.' అని ఆవిడ బండిలోంచి అల్లుడి గొప్పతనమంతా వెళ్ల బోసుకుంది. "చాల్లేవమ్మా ఈ ఎండలో వీథులన్నీ తిప్పేటప్పటికి గుర్రం చచ్చి పోతుంది. అంత పలుకుబడి గల పెద్ద మనిషి స్టేషను కెవర్నన్నా పంపక పోయాడా? ఉత్తరం ముక్క రాయక్క ల్లేదుటమ్మా" అని వాడు కల్యాడికిమల్లే ప్రారంభించాడు. బండిలో ఓ పాతట్రంకు పెట్టి రెండు వూరగాయజాడీలు, ఒక పెద్ద మూట, మరచెంబు, ఓ విసనకర్ర తప్ప సామాగ్రి ఎక్కువ లేదు.

ఆ విధవరాలే గాకుండా లోపలో పదహారేళ్ల చిన్నది కూడా కూర్చొనివుంది. ఆ అమ్మాయిముఖం ఎర్రగా కందిపోయి గాడ్పులకు పెదవుల తడి యారి జొట్టా కాగిపోవటంవల్ల చూడ్డానికి వడిలిపోయిన తామరతూడుల్లా వుంది.

ఆ విధవరాలు మళ్లీ నసుగుతూ 'అమ్మాయీ ఏం చేద్దామే బావగారి యిల్లు సరిగ్గా తెలుసుకోకపోతిమి. ఈ బండి అబ్బాయి వూరికే పణుగుతున్నాడు.' అని అంది. లోపల కూర్చున్న ఆ అమ్మాయి మాట్లాడకుండా బయట దూరాన్న వంతెన మీద ఎండవేడికి కరుగుతున్న రోడ్డుమీది తారులో మిలమిలలాడ్తూన్న సూర్యకిరణా లను చూసి ఆనందిస్తోంది.

'దిగండమ్మా దిగండి. ఆ చెట్టునీడను సామాను దింపుతాను, ఏం మనుషులమ్మా-యిల్లూ వాకిలీ తెల్సుకోకుండా తీసికెళ్ళమని బండి ఎక్కితే బండికి మీ అల్లుడిగారి వైనమంతా తెలుస్తుందా?'

అని సామాను ఒక్కటొక్కటే దింపి చెట్టుక్రింద పడేశాడు. విధవరాలు రొంటి నున్న చిన్నమూటలోంచి ముప్పావులా తీసి వాడిచేతిలో వుంచుతూ -'రావే కనకం, కాస్సేపు యిక్కడ నిల్చుని ఎట్లాగన్నా తెలుసుకుందుకు ప్రయత్నిద్దాం.'

ఆ అమ్మాయీ ఆవిడా ఆ మిటమిట లాడే యెండలో దిక్కులు చూస్తూ ఆ చెట్టునీడను నిలుచుండిపోయారు. తల్లీ కూతుళ్లు కాస్సేపు ఒకరిముఖం కేసి ఒకరు చూసుకున్నారు. నలిగిన కాగితముక్కలా వుంది ఆ అమ్మాయిముఖం. ఎవ్వరూ రోడ్డు మీద నడువ సాహసించటం లేదు.

రైలుప్రయాణీకులు యిందాకనే పల్చ బడిపోయారు. మామూలుగా రోడ్డుమీద వేరుశనక్కాయ లమ్ముకునే ముసలమ్మలూ అక్కడక్కడ పళ్లు అమ్ముకునే చిల్లర వ్యాపారస్తులుకూడా యిప్పుడు మధ్యా హ్నంపూట బేరాలు ఏత్తేశారు.

'అమ్మా దాహ మవుతున్నదే.' అన్నది కనకం. ఆ విధవరాలు మంచినీళ్లు మరచెం బులోనుంచి గ్లాసులోకి వంచి ఆమెకు నోటిదాకా అందిచ్చింది. ఆ విధవరాలు దారివెంట ఎవరన్నా వస్తారా, తమ అల్లుడి వైనం బయట పడ్డాని కని ఆశతో ఎండ తిరగటంకోసం ఎదురు చూస్తోంది. ఆ అమ్మాయి నిశ్శబ్దంగా ఏ మాలోచిస్తున్నదో ఆలోచించుకుంటూ పెట్టెమీద చెట్టునీడను కూర్చున్నది నిశ్చింతగా.

నాలుగున్న రయేవరకూ నిర్మానుష్యమై వున్న వీథులన్నీ తిరిగి మేలుకున్నై. సైకిళ్లు రిక్షాలు బస్సులు రోడ్లను ఆక్రమించు కోగా కుర్రవాళ్లు, ఆఫీసుమనుష్యులు తిరిగి ఒక చోటనుంచి మరొకచోటకు పయనమై పోతున్నారు. సరిగా యిదే సమయానికి కాంతారావు స్నానంచేసి భోజనం పూర్తి గానిచ్చి ఓ నిద్రతీసి కాస్త మంచిదుస్తులు చిల్లరడబ్బులు జేబులో వేసుకుని బజారు లోకి వచ్చి అన్నివీథులూ ఎరిగివున్న పరి చయస్థుడికిమల్లే దర్జాగా నడక సాగించాడు. నిజానికి పట్నవాసపు కుర్రవాళ్లెవళ్లూ ఆ వేళలో విహారార్థం వాహ్యాళికి బయలు దేరరు. కాంతారావు బయలుదేరా డంటే అతనికి ఒంట్లో పట్నవాసపు కుర్రవాళ్ల కంటే ఎక్కువ ఓపిక శక్తి వుందిగనుక. కాంతారావు బయలుదేరా డన్నమాటేగాని అతనికి రోడ్డుమీద ఎక్కువమంది జనం కనుపించకపోయ్యేసరికి నిరుత్సాహ మేసింది. అసలు ముఖ్యంగా వచ్చింది ఏ హోట్లో ఏ సినిమాయో తెలుసుకుందామని - ఆపైన కాస్త అగ్నికార్యం కానిచ్చుకోవటానికి. ఒక సిగరెట్టు ముట్టించి రోడ్డుమధ్యగా మందంగా నడుస్తూ నడుస్తూ చెట్టుక్రింద కూర్చొన్న విధవరాలునీ, ఆ అమ్మాయినీ చూసి టక్కున బ్రేకు పడినట్లు ఆగి "వీళ్ల దుంపెయ్యా - వీళ్లు యిక్క డెందుకు కూర్చున్నారు? ఏమో ఏ బస్సుకోసమో ...కనకం మొగు డీ వూళ్లో ఏదన్నా వుద్యోగం చేస్తున్నా డేమో -" అనుకుని తన కెందుకనే నిర్ణయంతో మరీ విలాసంగా పొగ పీలుస్తూ రోడ్డు మీద నడక సాగించాడు.

అస్సలు కాంతారావుది చాలా సున్నిత మైన హృదయం. ఎరిగివున్న స్వగ్రామ స్తుల్ని పలకరించేవాడే. పలకరించకపోవ టానికి గల ప్రబలకారణ మేమిటంటే యిప్పుడా చెట్టుక్రింద కూర్చున్న విధవ రాలు ఆ కనకాన్ని తన కివ్వటానికి నిరాక రించింది. ఏ కారణంవల్ల-? ఫోర్త ఫారం తప్పాడని, చదువు లేదని, సరిగ్గా

అదే సమయానికి స్కూలు ఫైనలు ప్యాసయిన సంబంధ మొకటి వచ్చింది. ఆ పిల్లనట్లా యివ్వటం జరిగింది. కనుక దర్జాగా భయం లేకుండా సిగరెట్టు కాలుస్తూ రోడ్డుమీద వాళ్ల కేసి చూడకుండా తిన్నగా ముక్కుకు సూటిగా నడవ నారంభించాడు.

కాని కనకం వున్నట్లుండి కాంతారావుని గుర్తుపట్టింది. కనకానికి కాంతం ఎరిగున్న బాల్యస్నేహితుడే. ఆ పిల్లకు ప్రాణం లేచివచ్చిన ట్లనిపించిందో ఏమో- పెట్టెనుంచి ముందు లేచి – కనకం రోడ్డు అంచులదాకా నడిచివచ్చి "కాంతం. కాంతం." అని వినపడేలా కేక వేసింది.

కాంతారావుకి హృదయస్పందనం ఆగిపోయింది. కాని కాళ్లు నడుస్తున్నాయి. మనస్సు నిర్మొహమాటంగా "వెనక్కు తిరక్కు. నీకు సిగ్గులేదూ – చదువు లేదనీ ఉంరవనీ నిన్ను ఆ పిల్ల చేసుకోలేదు. ఇప్పుడు పలకరిస్తే తగుదువమ్మా అని వెళ్లి వింటావా? ఛీ!" అని ఉద్బోధిస్తోంది.

కాంతారావు ఒక్కమాటు తనకేసి చూసుకున్నాడు. ఇప్పుడు తన కేమి లోటు. నిజంగా ఆ కనకం మొగుడు తనిప్పుడో గుద్దు గుద్దితే ఆగగలడా? వెళ్లి నీ మొగుణ్ని నాలుగు వాయిస్తాను – ఎదురుతిరిగి నన్ను కొట్టగలడూ అని అడుగుదా మనిపించింది.

మళ్లీ వెనకనుంచి – 'కాంతం – కాంతం' అని కనకం కేక వినిపించింది. ఏమైనా సరే వెనక్కు తిరగను – 'నాతో నీ కేమిటి పని' అందా మనుకున్నాడు. కాని నడకమాత్రం మందగించింది.

ఈ పట్టు కనకం రోడ్డుమీద గబగబా నాలుగు అంగలు వేసి కాంతాని కెదురుగా వచ్చి 'నిన్నే పిలుస్తూంట కాంతం- ఒక్కమాటు యిల్లా వచ్చి వెళ్లిపో...' అంది.

కాంతారావు కొంచెం దురుసుగా 'ఏమిటి పని?' అని హేళనగా నవ్వాడు.

కనకం చాలా చిన్నపుచ్చుకున్నదై 'నీకుపకారం చెయ్యాలని వుంటే ఒక్కమాటు నా వెంట వచ్చి నేం చెప్పేది విను. లేకపోతే నీ యిష్టం...అని జాలిగా చూసింది.

కాంతారావు 'ఉపకారమూ' అని మెల్లగా 'పద వస్తున్నా' నంటూ కనకం వెనక్కాల చెట్టుదాకా నడిచాడు. ఆ విధవరాలు కనకం వెంట వచ్చిన యువకుణ్ణి మొదట్లో గుర్తించలేదు.

కాంత సిగ్గుతో కొంతయిష్టతతో "అమ్మా- కాంతం వచ్చాడే. కనుక్కో బావగారి యిల్లు తెలుసునేమో, అంది. విధవరాలు చాలా ఖిన్నురాలై 'ఏం నాయినా కులాసాగా వుంటున్నావా. ఇప్పు డిక్కడేం చేస్తున్నావు? అంది. కాంతారావు సగర్వంగా-

'స్కూలు ఫైనలు చదువుతున్నాను.' అని రొమ్ము విరిచాడు. కనకాని కెందుకో పెదవుల చివరదాకా వచ్చిన నవ్వు లోపల్నే అణిగిపోయింది.

"మాఅల్లుడు చక్రధరరావు నెరుగుదువూ? అతని యిల్లెక్కడ? మధ్యాహ్నం ఒంటిగంటనుంచి తెలియక సతమత మవుతున్నాం" అంది విధవావిడ.

'నేనూ ఒంటిగంటబండికే వచ్చాను. నాకు మీ అల్లు డెవరో ఎట్లా తెలుస్తుంది? ఇంతకీ ఏ అల్లుడు? కనకానికీ షాకు బాగా తగిలింది. విధవరాలు మనస్సులో యీ గుప్తాఘాతానికి మొద లెక్కడో వూహించుకున్నదై నా విధిలేక-

'మా రుక్మిణి నెరగవూ-దాని మొగుడు చక్రి అనికూడా అంటారు.

'మరి మీరు బయల్దేరేముందు ఉత్తరం వ్రాసుకోలే-'

'లేదు నాయనా-ఇక్కడ్నుంచి వచ్చే ఆసామీ చేత మా అమ్మాయి కబురు చేసింది. వంట్లో సుస్తీగా వుందని. ఆ మట్టాన బయల్దేరి వచ్చాం ఆలోచించుగోకుండా'

ఆవిడకంఠధ్వనిలో గాద్గదికత కూడా వచ్చింది. కాంతారావుమనస్సు యిక అట్టే ఎక్కువకాలం గడ్డకట్టుకొని వుండలేకపోయింది.

'మా యింటికి వెళ్లిపోదాం రండి. సాయంత్రం మా బాబయ్య వస్తాడు. బహుశా అతడు మీ అల్లుడివిలాసం చెప్పగలడనుకుంటా. అన్నదాని కా విధవావిడ,

'ధర్మారావా-అతనికి తెలిసేవుంటుంది. అంది.

కాంతారావు కుదిర్చిన బండిలో వారు ముగ్గురూ ధర్మారావుయింటికి బయల్దేరారు. కనకం కళ్లలో నీళ్లు తిరిగినై.

౪

మన కెప్పు డెవరితోటి అవసరం వస్తుందో ఎవరి సహాయం అత్యవసర మవుతుందో చెప్పటం కష్టం. మనదృష్టిలో అసమర్థులు అత్యల్పులు కించిద్జ్ఞులై కనపడే వారితో కూడా ఎప్పుడో విధివశాన ఏదో పని గడవవలసిన పరిస్థితులు రావచ్చు. అందుకని ఎవర్ని నిర్లక్ష్యంగా చూడటంగాని కించపరచటంగాని అవమానించటంగాని జరగకుండా చూసుకోవాలి. అలా లేకపోతే కిల్లీదుకాణదారుడుకూడా మనకు ఋణదాత అయే పరిస్థితి చాలా సహజంగా ఏర్పడవచ్చు.

అసలీ సృష్టిలో అల్పుడు అధికుడు అని ఎవరున్నారు? అల్పజ్ఞత ఆధిక్యతలు ఏ సూత్రాలమీద ఆధారపడి నిర్ణయించబడతాయి? కాంతారావుకు పిల్ల నివ్వమని భీష్మించుకు కూర్చుని పంతగించిన విధవరాలుకీ కానిచోట యిప్పుడు ఎవరు దిక్కయ్యారు? ఎక్కడి రంగాపురం! ఎక్కడి పట్నం? కూతురుకు జబ్బుగా వున్నదని చూడవస్తే యిల్లు తెలియకపోతే కాంతారావే గతయ్యాడు.

ధర్మారావింటికి రాంగానే యిల్లంతా బిలబిల లాడుతోంది. క్రొత్తచుట్టా లెవరా? అని ఆలోచిస్తూండగా ఆ పెద్దామె పలకరించింది. 'బాబూ కులాసాగా వున్నావా?' అని. ధర్మారావుకు చాలా ఆశ్చర్యమే వేసింది.

"మీ రా ... మీరా ... ఏమి టిల్లా వచ్చారు?"

పాతకాలపునాటి కథ తెరమీద వెనక్కు నడచివచ్చి మనఃఫలకంమీద చిందులు తొక్కసాగింది. రంగాపురంలో ఎత్తరుగుల పెద్దమండువాలోగిట్లో ధర్మారావు శూర్పణఖతో చింతగింజలు, తొక్కుడుబిళ్ల ఆటలాడిన రోజులు కళ్లకు కట్టినట్లు ఎదుట తోచసాగాయి. శూర్పణఖ – ఎంత చమత్కారమైన పేరు. ధర్మారావుని తొడాటలో పంతొడుతో బలంగా మొత్తింది. అప్పు డేం చేశాడు. తొక్కుడుబిళ్ల పెంకులు సూటిగా ఆ పిల్లముఖంమీదకు విసరటం, సరిగ్గా దాని ముక్కు చితికి నెత్తురు కారటం. అప్పట్నుంచి స్నేహితు

(33-వ పేజీ చూడుడు)




శ్రీ నోరి నరసింహశాస్త్రి

౪౬

"సంగాసంగజయాజయంబు పరిహా
సప్రస్ఫుటోల్లాల భా
షాంగం బాకలితాంగహారవలయ
కల్పాభోగముద్రాలస
ద్భంగీనిష్ఠిత కౌస్తుభాంశుకము పా
పద్యోత మీ సన్నిదం
బంగీకారము సేయువారి మెలలం
బ్రాపించు గోపీనముల్"

వినుకొండ వల్లభరాయడు

యువకవి యగు గోవిందశర్మయు కరణపాఠశాలలో చేరి విద్య నభ్యసించుచుండెను. శస్త్రపరిశ్రమ యాతనికి పూర్వపరిచితమే యైనందున ఈ నెలరోజులును ఆటవిడుపుగానే ఉన్నది అతని తోడి బ్రాహ్మణులలో నెక్కువమంది మహాశివరాత్రినాడు శస్త్రసాధనసిద్ధికై స్వయంభూదేవాలయమున శతరుద్రీయము జపించుచుండిరి అతనిది తిరుగనేర్చిన కాలు అయినందున, నిలుకడగా నచ్చట నిలువలేకపోయెను మహాశివరాత్రియుత్సవము చూచుచు ఓరుగంటి వీథుల వాడల సంచారము చేయ నాతడు బయలుదేరిపోయెను

దారిలో నాతడు కర్ణాటభామలతో సరస మాడుచు, పామరభామలు గోమయపిండములు ఇంటిముంగిట చేయుట చూచుచు, సంపెంగనూనె యమ్ము కరణకాంతల కోకిలస్వరము లాలకించుచు, ములికినాటి తెలికి చిలుకలకొలికుల జలుకుజూపుల కులుకుచు, మోహరివాడలో వస్త్రపు పనివారిం గాంచుచు, నొక్కచోట పల్నాటివీరుల కథ లాలకించెను

*"ద్రుతతాళంబున వీరగుంభితకథం
ధుంధుం కిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళిక యతి
గ్రామ స్ఫిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీ
రానీకముం బాడె నొ
క్కతె ప్రత్యక్షరముం గుమారకులు ఫీ
ట్కారంబునం దూలగన్

* వల్లభరాయుడు

ఆత డంత కాకతమ్మను నైగోడను ఏకవీరను దర్శించి, ఆ దేవతయెదుట పరశురాముని కథ లన్నియు పాడెడి బవనీల చక్రవర్తిని గాంచెను దారిలో కాపుటాండ్రను జక్కుల పురంధ్రిని జూచుచు, సంతానకాంక్షి యగు నొక యజమాని అక్కలకు పెట్టుకొనుట తిలకించెను భైరవుని గుడి, చాముండేశ్వరీశక్తి నగరు, వీరభద్రాలయము, బుద్ధుని గుడి, ముసానమ్మ గుడి, కుమారస్వామి యాలయము, పాండవుల గుడి, చూచుకొనుచు బోయి యాతడు మధ్యాహ్నమునకు బ్రాహ్మణులవాడకు చేరికొని, యట పూటకూటింట నొక్క రూక యిచ్చి కప్పురభోగి కంటకము కమ్మని గోధుమ పిండివంటయు గుప్పెడు పంచదారయును క్రొత్తగా గాచిన —ల నేయితో పెసరపప్పును కమ్మని నల్లనటిపండ్లు ఐదు వంజులతో గడ్డపెరుగుతో కూడ భుజించి గర్రున త్రేపుచు మరల నగరసంచారమునకు బయలుదేరెను

అభ్యాసవశమున నాతని కాళ్లంటట వేశ్యల వాడవైపునకు సాగిపోయినవి దారిలో కోళ్ళపందెములు పొట్టేళ్ళపోరు చూచునంతలో చీకటిపడెను వేశ్యలవాడసమీపమున పలువురు జూదమాడుట యాతడు లక్షించెను మాచల్దేవిముఖసందర్శనము చేయవలెనను నుత్కంఠనుగూడ మించి యాతని నా యక్షుల చప్పుడు నిలువవేసెను

ఆ జూదమాడువారు గోవిందశర్మకు పూర్వపరిచితులు కారు. వారి యాకారములును మాటలునుగూడ అటువైపువారివిగా కనుపట్టలేదు కాని జూదములో క్రొత్తపాతలతో నిమిత్తము లేదుగదా! ప్రొద్దుపోవువరకు వారితోపాటు గోవిందశర్మయు జూదమాడెను. కాని మధ్యమధ్య వారు పన్నిదములు చేయుటలో నర్మగర్భముగా "ఇదిగో మేచయకలతో పందెము!" "ఇదుగో మహాదేవరాజు!" "ఇదుగో ప్రతాపరుద్రుడు!" "రుద్రదేవమహారాజే ఈ పందెమునకు సాక్షి!" —ఇట్టి మాట లాతడాలకించి కలవరపడసాగెను జూదరుల సంభాషణలో తప్పనిసరిగా వచ్చు, అశ్లీలములు మే, ములు అర్థము లేని మాటలు పౌరుషవచనములు సంకేతవాక్యములు అతనికి పూర్వపరిచితములే! కాని యీనాగట్లు వారు మాట్లాడుచుండుట యాతనికేదో ఒక భయము కలిగించుచుండెను

అంతలో దూరమున జైనవసతినుండి యొక ఘంటానాదము భయంకరముగా వినవచ్చెను ఆ ఉత్తరక్షణముననే ఆ మదిం

రాంతర్భాగముననుండి యొక జైనసాధువు వచ్చి చేయి యెత్తెను. అందరు నొక్కసారిగా మంత్రముగ్ధులవలె యాట చాలించి లేచి నిలువబడిరి. ఆ సాధువు గోవిందశర్మపై క్రూరమైన దృష్టి ప్రసరింపజేసి "ఇత డెవరు?" అని యచ్చటివారల బ్రశ్నించెను.

ఆ మాటలు వినినంతనే ఆ కంఠస్వరము పూర్వపరిచితమైనదని యాత డుపలక్షించెను. అది మాచల్దేవిభవనమున, పర్వతనాయకునితో జూద మాడి పోరిన యజ్ఞాతయోగిది! అత డాతని కంఠము గుర్తించినదే తడవుగా ప్రక్క నున్నవా రాతని బట్టుకొనబోవుచుండి రని యాతనికి దోచినది. వెంటనే శర్మ వీథిలోనికి పరుగెత్తెను. నలువు రాతని వెంబడించిరి. చీకటిలో గోవిందశర్మ పారిపోవుచుండెను. వెంటబడువారిలో నొక్కడే యాతని నుపలక్షించి పట్టుకొన మీద బడెను. గోవిందశర్మ పూర్వాభ్యస్త మగు మల్లయుద్ధనైపుణ్యముచే నాతని మూడు పిడిగ్రుద్దులతో క్రింద పడవేసి తప్పించుకొని పోయి వేశ్యవాటిక జొచ్చి మాచల్దేవియింటిలోనికి పరుగువారెను.

మాచల్దేవి యాతని తత్తర ముపలక్షించి ఎకసక్కెముగా, "ఏమిటి కథ, యువకవిగారూ?" అని ప్రశ్నించెను.

"కొంప మునిగిపోయినది!"

"మీ రీనాడు చెప్పిన పద్యములో యతిభంగమయినదా?"

"మన కాభయము లేదు. యతిభంగమైన ఆంధ్రపద్యమును కర్ణాటసంప్రదాయమని తప్పించుకొందును."

"మరి ప్రాసభంగమైనచో?"

"అది నీకు తెలియదు, సంస్కృత మందును!"

"మీ దేహమున కేదో, ఈ మహాశివరాత్రిపూట, సంస్కారమైన ట్లున్నదే!"

"సంస్కారమే కాదు, దేహశుద్ధియే కావలసినది, తప్పించుకొంటిని!"

"ఎవతె యింట"

"అట్లైనను సరసత ఉండెడిది. జూదరుల యింట?"

"ఓడి ఎగవేసి వచ్చితిరా? నేను వారికి మిమ్ము పట్టించి ఈయవలసివచ్చును!"

"ఆ భయము లేదు!"

ఈ మాటలతో గోవిందశర్మ తేరుకొని మాచల్దేవికి ఏకాంతమున జరిగిన దంతయు తెలిపెను.

గోవిందశర్మమాటలు వినినంతనే మాచల్దేవికిని భయమయ్యెను. కొంతకాలమునుండి ఆ యోగిసంగతి తలచినప్పుడెల్ల విపరీతమైన భయముతో నది యదరిపోవసాగెను. నగరనాయకులనుగూర్చి యంత చులకనగా ప్రసంగించుటయు, వారి తలలపై నవ్వులకైన పందెము లొడ్డుటయు, సామాన్యులు చేయునవి కావు. జైనవసదిలో నేమినాథప్రతిష్ఠకు నగరిపెద్ద లందరను వెళ్లియుండిరి. అక్కడి ఘంటకును ఇక్కడ యోగి జూద మాడుటకును ఏదో సంబంధ ముండియుండవలెను. ఏదో మహాప్రమాదము జరిగియుండవలెను!

ఇట్లాలోచించుచుండినంతలోననె, జైనవసదికి తమ ప్రభువులవెంట నేగిన పరిచారకులు తమ ప్రభువులు కనబడనందున వేశ్యవాటికకు వచ్చి రేమో తెలిసికొనుటకు వారు వచ్చిరి. మేచయనాయకుని పరిచారకులు వచ్చి మాచల్దేవికి నమస్కరించి "మా ప్రభువు లిటు వచ్చిరా?" యని ప్రశ్నించిరి.

మాచల్దేవి "లేదు. ఏమి జరిగినది?"

"మా ప్రభువులు నేమినాథదర్శనమునకు లోపలికి పోయిరి. మరల గనబడలేదు."

"అంతేనా? మరియొకమార్గమున ఇంటికి వెళ్ళిరేమో!'

"లేదు. మహాదేవరాజులును కనబడలేదని వారి పరిచారకులు వెదకుచున్నారు."

"ఆఁ! ఏమి?"

"అంతే కాదు! ప్రసాదాదిత్యనాయుడు రుద్రమనాయుడు ప్రోలరాజు, నాగదేవనాయుడు!-"

"త్వరగా పోయి, మీరు శ్రద్ధగా వారు సామాన్యముగా వెళ్లు ప్రదేశములు వెదకుడు!"

ఇట్లనుచునే మాచల్దేవి తీవ్రముగా నాలోచించెను. శీఘ్రముగా నొక నిశ్చయమునకు వచ్చెను. లోనికి పోయి ఒక్క యరగడియలో పురుషవీరుని వేషము ధరించి ఖడ్గము చేత బట్టి, గోవిందశర్మనుగూడ కవచము శిరస్త్రాణము ధరింపజేసి ఖడ్గము చేతి కిచ్చి తనతో రమ్మని దొడ్డివాకిటిగుండ నాతనితోగూడి ప్రయాణమయ్యెను.

మాచల్దేవి యట్లు పోయి పోత్రింయవ్వాణమున చేరిదిమయి యక్కడ కాపున్న భటునిద్వారా తిక్కనసోమయాజులకు మీ కొరకు శరణాగతు లిరువురు వచ్చినారని వార్త పంపెను. ఆ మాటలకు వెంటనే తిక్కనసోమయాజులు లోపలికి రానిమ్మని యనుజ్ఞ యీయగా భటుడు వారిని లోనికి తీసికొనిపోయెను.

మాచల్దేవి గోవిందశర్మ వెంట పోయి సోమయాజులకు ఆతనితోపాటు మ్రొక్కెను. వా రిరువురును జరిగిన దంతయు సోమయాజులకు నివేదించిరి. సర్వము నాలకించి సోమయాజులు వారి ముఖములు తేరిపార జూచెను. మోసము కనబడలేదు. అంతట నాతడు వారి ని ట్లడిగెను.

"నావలన మీకు కావలసిన కార్య మేమి? ఈ యర్ధరాత్రమున మీ మాటలు నమ్మువా రెవరు?"

"మీయొద్ద శ్రీరుద్రదేవమహారాజుల అభయపత్ర మున్నది. మీ రెప్పుడైనను ఎక్కడికైనను పోవుటకుగూడ ననుజ్ఞ కలదు. ఈవేళ రాజమందిరము చొచ్చి, యీప్రమాదవార్త రాజప్రతినిధుల కందజేసి, ప్రతీకారము ఆలోచింపవలెను!"

సోమయాజులు మరియొక్క క్షణమే యాలోచించెను. ఇది యాలోచించుటకు గాని యాలసించుటకు గాని సమయము కాదు. గురునాథునకును మారనకును దివాణపు భటులతో జాగరూకులై కాచుచుండవలె నని చెప్పి యప్పగించి, గోవిందశర్మను మాచల్దేవిని వెంట దీసికొని రాచనగరికి బయలుదేరెను.

నగరికి బయట కాపున్న భటులు ముందు వారి నడ్డగించిరి. ఆ పిమ్మట సోమయాజులు చూపిన పత్రములు చూచి, కన్నుల కద్దుకొని, వారికి భయభక్తులతో త్రోవ విడిచిరి. కాని వారివెంట మాచల్దేవిని గోవిందశర్మను పోనీయలేదు.

సోమయాజుల కోరికప్రకారము భటులు దారితీయుచు సగౌరవముగా రుయ్యమ్మవాకిలిముందుకు తీసికొనిపోయి వారి రాకయామె కెరిగించిరి.

---

# అలవాట్లు

శ్రీ పి. వి. భట్టుశర్మ

"అమ్మా! నా జోళ్ళెక్కడున్నాయే?"

"ఏమోనమ్మా! నిన్న సాయంకాలం స్కూలుకి వెళ్ళివచ్చి నువ్వేగా ఎక్కడో దాచుకున్నావు? నీ జోళ్ళసంగతి నీకే తెలియకపోతే నా కెట్లా తెలుస్తుంది?"

"కాస్త వెతికిపెట్టుదూ! స్కూలుకు టైమయిపోతున్నాది. తొందరగా వెళ్ళకపోతే మేష్టారు ఆబ్సెంటు వేసేస్తారు"

"అబ్బ, పనివేళ - నన్ను వెదక మంటే ఎట్లా, నాన్నగారికి కోర్టువేళకు భోజనం వడ్డించాలాయె. ఇంకా కూరేనా కాలేదు" అని సణుగుతూ ఎట్లానో తీరుబడి చేసుకొని వెతికి వెతికి ఏ బీరువాఅడుగునుంచో జోళ్ళను తీసి పిల్లలను స్కూలుకు పంపడం సామాన్యంగా జరుగుతూంటుంది. ఇట్లాగే పలక, పెన్సిలు, అగ్గిపెట్టె మున్నగు నిత్య కృత్యావసరాలలో ఏదో ఒకటి పిన్నలూ పెద్దలూ కూడ వెతుక్కోవలసిన అవసరం ప్రతినిత్యం ఉంటుంది. ఎక్కడా ఏ ఇంట్లోనూ, వస్తువులు నియమితస్థానంలో ఉండే అదృష్టం నోచుకోవు. తువ్వాలు చేతో తుడుచుకుని అట్లాగే ఎక్కడో పెట్టేస్తాం. మళ్ళీ దాని అవసరం ఇంట్లోవారి కెవరేనా కలిగేవరకూ దాని అజాపజా పట్టించుకోము. ప్రకృతిచికిత్సాపరాయణులకు, పూర్వాచారపరాయణులకూ తప్ప, ప్రతివారికి సబ్బు అవసరమైన వస్తువే. ఆ సోపు ఎవరిచేతులో ఎట్లా మాయమై కూర్చుంటుందో తెలియదు. స్నానంవేళకు సర్వసామాన్యంగా వాస్కోడీగామాలు అవుతూంటారు.

ఇంతకూ చెప్ప వచ్చే దేమిటంటే-ఇట్లా వస్తువులను అజాగ్రత్తగా మనపని పూర్తయిన తరువాత వాటి దారిన వాటిని వదిలివేయడంగాక ప్రతివస్తువుకూ కొన్ని నియమితస్థానాలను ఏర్పరుచుకుని, ఆయా వస్తువులను మనపనులు పూర్తికావడంతోనే వాని వాని నియమితస్థానాలలో ఉంచే అలవాటు ప్రతిఒక్కరూ చేసుకోవాలి. కాని ఈ అలవాటు అన్నది బాల్యంలో అభ్యసిస్తే వచ్చేటంత తేలికగా పెద్దయిన తర్వాత రాదు. అందుచేత మన బాలురకు ఇటువంటి మంచి అలవాట్లు నేర్పాలి. నేర్పవలసిన బాధ్యత పెద్దలది. మొక్కై వంగనిది మ్రానై వంగదు. బాల్యానంతరం ఇటువంటి అలవాట్లు ఎంతో శ్రమపడితేకాని రావు.

అదైన ఈ అలవాట్లవలన మన కెంతో సమయంకూడా కలిసివస్తుంది. ఒక్కొక్కప్పుడు మనకు కావలసిన వస్తువులు వెతుక్కోడంకోసం ఎంతో ప్రయాసపడి సమయం వ్యర్థం చేసుకుని, బుర్ర పగలకొట్టుకుని చివరకా వస్తువులు పోయాయి అనే నిర్ధారణతో, మళ్ళీ కొత్తవస్తువులను వాని స్థానంలో ఏర్పాటు చేసుకోవడం, ఏమారు మూలో, మళ్ళీ ఆ పాత వస్తువులు ఇంకే వస్తువునో వెతుకునప్పుడు, అయాచితంగా ప్రత్యక్షం కావడమూ, సంభవిస్తూంటుంది.

సామాన్యంగా మనం ఇళ్ళల్లో ఉపయోగించుకొనే వస్తువులను రెండు తరగతులనుగా విభజింపవచ్చును. కొన్ని ఇంట్లో ప్రతిఒక్కరూ ఉపయోగించుకొనేవి; సబ్బు, తువ్వాలు, ఇత్తడిచెంబు వగైరా. కొన్ని వస్తువులు ప్రత్యేకవ్యక్తులు మాత్రమే ఉపయోగించేవి; జోళ్ళు, పెన్సిలు, పుస్తకాలు వగైరా. ఇంట్లో అందరూ ఉపయోగించుకొనే వస్తువులను, ఇంటిలోని వ్యక్తులందరూ కలిసి ఆయావస్తువులు ఫలానా నియమితస్థానంలో ఉండాలి అని నిర్ణయించుకొని, ఆ నిర్ణయానుసారంగా తమ తమ ప్రత్యేకోపయోగం తీరిన వెంటనే నియమితస్థానం చేర్చేవరకూ తమపని పూర్తి కాలేదనే భావంలో ఉండాలి. ప్రత్యేక వ్యక్తులు ఉపయోగించే వస్తువులకు ఆ యా వ్యక్తుల ఇష్టానుసారం స్థాననిర్ణయం జరిగినా బాధ లేదుగాని, ఉపయోగానంతరం నిర్ణీత స్థానానికి ఆ వస్తువులను చేర్చడంలో ఎంత మాత్రమూ అలసతపడకూడదు. ఏమంటే ఈ అలసత తర్వాత తమనే వెతుకుకొనేటట్లు చేసి ధనతుల్యమైన సమయాన్ని వ్యర్థం చేస్తుంది కాబట్టి.

బాలురకు చిన్నతనంలోనే ఇట్లా నిర్ణీతస్థానం చేర్చే అలవాటు చేయాలి. అంటే, వారికి కొన్ని స్వంతవస్తువులను ప్రత్యేకించి 'ఇవి నావి' అనే భావం ఆ వస్తువుపై వారికి కలిగేటట్లు చేయాలి. బాల్యంలో మమకారం బాగా ఉంటుంది. కొందరు పిల్లలు కొన్నికొన్ని రంగురాళ్ళ నేరి తెచ్చి వాటి నెంతో ప్రాణపదంగా దాచుకుంటారు. ఆ రాళ్ళల్లో ఉండే రంగు వారి నంతగా ఆకర్షించి, వారి కవి దాచుకోవాలి అనే భావాన్ని కల్గిస్తాయి. అట్లాగే మనం వారి అధీనంలో కొన్ని వస్తువుల నుంచి, - "ఏదమ్మా - ఒక్కసారి - నీ పెన్సిలు మర - ఇట్లా ఇయ్యవూ? పెన్సిలు చెక్కుకుని నీ కిచ్చేస్తాలే" అనగానే వారెంతో జాగ్రత్తగా ఆ మరపట్టుకువచ్చి మన కిస్తారు. మనం చెక్కివేయడం పూర్తి కాగానే, "ఇదుగో - నీ పెన్సిలుమర, భద్రంగా దాచుకో" అని చెప్పామంటే చాలు. వారు మళ్ళీ దాన్ని యథాస్థానంలో పెట్టి వస్తారు. ఇట్లా వారికి సరళంగానే చెప్పి ఎన్నో మంచి అలవాట్లు నేర్ప వచ్చును.

---

శ్రవ్యనాటిక :

# పట్నవాసపు మర్యాద

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

పాత్రలు :

1 మాధవరావు
2 వాసుదేవరావు
3 కేశవరావు
4 గృహయజమాని
5 సుందరి
6 జవాను
7 వెంకయ్య
8 తపాలామనిషి

కేశవ : ఏమోయ్! మాధవరావు, పొద్దున్నే వచ్చావేమిటి సంగతి! బొత్తిగా కనబడటము మానేశావేం? ఊళ్లోనే ఉన్నావా?

మాధ : ఊళ్లోనే ఉన్నాను. ఎన్నాళ్లు వెతికినా ఇల్లు దొరకటము లేదు. నేనొక్కణ్ణే కనక మా స్నేహితుడింట్లో ఉంటున్నాను.

కేశవ : ఇల్లు దొరక్కపోవటమేమిటి? ఇంత పట్నమూ గొడ్డుపోయిందా?

మాధ : నిజంగా అట్లాగే ఉన్నది! తిరిగి తిరిగి కాళ్లు పడిపోతున్నాయి. వచ్చిన నాలుగు నెలలకు ఉద్యోగమయినా దొరికిందిగాని ఇల్లుమాత్రము దొరికేటట్లు లేదు. చూడటానికి ఇన్నియిళ్లు కనబడతాయి గాని ఎక్కడికి పోయి అడిగినా లేదన్నమాటే!

కేశవ : నీకు ఎంత అద్దెలో ఇల్లు కావాలో చెప్పు. నేనకూడా ప్రయత్నం చేస్తాను.

మాధవ : నాజీతముప్రకారమయితే ఇరవయికంటె ఎక్కువ యివ్వలేనుగాని ఈ పరిస్థితుల్లో ఇంకే ఖర్చయినా తగ్గించుకొని ఇంకో ఇరవయి ఎక్కువపెడ్తాను.

కేశవ : నేనుకూడా చూస్తాను. మళ్ళీ వారానికల్లా ఒక యిల్లు ఎట్లాగయినా దొరికేటట్టు చూస్తాను.

మాధవ :— (సంతోషముతో) నామీద దయఉంచి ఒకయిల్లు చూపిస్తివా— నీపేరు ఎప్పటికీ జ్ఞాపకము ఉంచుకొంటాను. నాకు ఈ ఊళ్లో అంతా కొత్తవాళ్లు. ఆ వాసుదేవరావుగారే మొదటినుంచీ మా కుటుంబానికి తెలిసినవాళ్లు. ఆ ముఖమాటము మీదనే ఇన్ని నెలలనుంచీ వాళ్లింట్లో ఉంటున్నాను. పాపము వాళ్ల యిల్లూ చిన్నదే. జన మెక్కువ. ఒక డజను మందిపిల్లలు– ఇద్దరు పెద్దవాళ్లూ తమ్ముడూ– అతని భార్యా... వాళ్లకే ఇరుకుగా ఉంటుందా యిల్లు. వాళ్ళ కెంత కష్టంగా ఉందో, పాపము. ఎంత పరిచయమున్నా పరాయి మగవాణ్ణికదా! వాళ్ళ ఆడవాళ్ళ కెంత కష్టముగా ఉందో?

కేశవ : నీవు మాత్రము ఏం చేస్తావోయి? వాళ్ళయింట్లో ఎల్లకాలము ఉండిపోవాలనుకోవటము లేదుగా! ఇల్లు దొరకగానే నీయింటికి నీవు వెళ్తావు. కొత్తగా వచ్చినవాళ్ళకు ఆమాత్రము సహాయము చేయకపోతే ఎట్లా? ఇంతవరకూ నోటితో ఏమీ అనలేదుకదా! అంతగా వాళ్లింట్లో వీలు లేకపోతే, నీకు యిల్లు దొరికేవరకూ మావాకిటిగదిలో ఉండవచ్చును. మాకేమీ అభ్యంతరము లేదు. కట్టుకుపోతామా వెళ్లేటప్పుడు?

మాధవ : నేను ఒక్కడినీ ఉండటానికేమిటిగాని, ఒకచిన్నయిల్లే కావాలి అవసరంగా. నీవు యిల్లు మాసిపెడతానంటేనే నాకు బ్రహ్మానందముగా ఉన్నది. ఉద్యోగముకొరకు ఆశ్రయించినదానికంటె ఎక్కువగా అందరిచుట్టూ తిరుగుతున్నాము. ఉదయము రెండు గంటలూ– సాయంకాలము రెండుగంటలూ తిరగటానికే సరిపోతున్నది.

కేశవ : (ఆశ్చర్యముతో) ఏమిటీ అంతచేటు తిరుగుతున్నావా?

మాధ : అవును. నా అదృష్టము బాగుంటే త్వరలోనే నీ సహాయము వల్ల దొరకవచ్చు.

## 2 వ రంగము

తపాలామనిషి : వాసుదేవరావుగారికి ఉత్తరము వచ్చిందండి.

వాసు : ఆఁ...కిటికీలోంచి పడెయ్యి... సుందరీ, ఉత్తరము తీసుకురా.

సుంద : మనకొక్కడు ఉత్తరము. మీ స్నేహితుడికి వచ్చినట్లుంది...అవునుగాని... మీస్నేహితుడు యిక్కడ ఎన్నాళ్లు ఉంటాడు? ఉద్యోగప్రయత్నములో నాలుగు నెలలూ – ఉద్యోగము దొరికిన తరువాత రెండు నెలలూనా? మన భవనమేమన్నా పెద్దదా?

వాసు : ఊఁ...పొద్దటినుంచీ కచేరీలో చాకిరి చేసిచేసి వచ్చినవాడిని. ఇప్పుడిదేనా? అయితే ఏమంటావు?

సుందరి : మాట్లాడితే కోపము వస్తుంది. ఊరుకుంటే పని గడవదు. ఆడవాళ్ల ఖర్మము ఎప్పుడూ యింతే. మీ స్నేహితుడికి ఉద్యోగము దొరికింది కనుక ఎక్కడయినా ఇల్లు చూసుకోమని చెప్పండి. మనకు ఇంటి నిండా పిల్లలు. వాళ్లు చదువుకోవటానికి– సంగీతము నేర్చుకోవటానికి స్థలమే లేకుండా ఉంది. అత్తగారికి రాత్రినుంచీ జ్వర మెక్కువయింది. మన సరళకు మూడవ నెల వచ్చిన దగ్గరనుంచీ వాంతులు. భోజనాల యింట్లో తప్ప ఆది పడుకోటానికి చోటు లేకుండా ఉంది.

వాసు : అయితే ఇందులో నాకు తెలియని దేమున్నది? మన యింటి వైశాల్యమూ నాకు తెలుసు– మన యింటి జవాబూ నాకు తెలుసు — మా అమ్మ ఆరోగ్యమూ — సరళ కడుపు సంగతి గ్రహించే ఉన్నాను.

సుంద : అఁహాఁ...?

వాసు : నా నిర్లక్ష్యమూ తెలుసు. నీ విసుగుదలా తెలుసు.

సుంద : మరి యిన్ని తెలిసిన వాళ్ళు మాట్లాడకుండా బ్రహ్మదేవుడిలా కూర్చుంటారేమి? సంసారము గడచే మార్గము ఆలోచించక్కరలేదా? ఈ బియ్యపు రేషను దినాలలో వంటయింట్లోకి వెళ్ళాలంటే దుఃఖ మొస్తున్నది. నాలుగుశేర్ల బియ్యము తెస్తే రోజుకి గుప్పెడు నూకలయినా మిగలటము లేదు. 24 గంటలూ ఇంట్లో ఉండి సంసారము చేసేవాళ్ళకు తెలుస్తుంది.

వాసు : సుందరీ! నీతోపాటు 24 గంటలూ ఇంట్లో ఉండి అన్ని విషయాలను కళ్ళారా చూడకపోయినా అన్ని సంగతులు నాకు తెలుసు. ఈ తగవులాటలో నాకు కాఫీ యివ్వటమయినా జ్ఞాపకము లేదు.

సుంద : మీకు తెలిస్తే అతనితో ఎందుకనరు?

వాసు: నేను నానోటిమీదిగా అనకముందే అతనే ఇల్లు చూసుకుంటున్నాడు. అతనికి తగినయిల్లు దొరకాలా వద్దా? నీకంటే ముందుగా ఇవన్నీ అతనూ అనుకుంటూనే ఉన్నాడు.

సుంద : ఎన్నాళ్ళపాటు అనుకుంటూ కూర్చుంటాడు? సంసారభారము ఏమాత్రము లేకుండా అతనికి హాయిగా ఇక్కడ గడచిపోతున్నది. నాకు మాత్రము ఈ సంసారాన్ని ఈదటము ఇంక ఒక్కక్షణమైనా చేతకాదు.

వాసు: (నవ్వుతూ) పోనీ మనిద్దరమూ వృత్తులు మార్చుకుందామేమిటి? మంత్రిగారి దగ్గర అసిస్టెంటుగా నీవూ - ఇంటి వ్యవహారాలు చూస్తూ నేను-ఇలా ఒకనెల గడిపి చూద్దాము ఏమంటావు?

సుందరి : మీకు సంసారబాధ్యత యిస్తే, నాలుగవ నాటికల్లా, ముసలివాళ్ళను ఆసుపత్రికీ-నన్ను పుట్టింటికీ-పిల్లలను హాస్టలుకీ మీరు వికాజీభవనానికీ-దారితీస్తారు. నాకు నీతులు చెప్పినంత సులభమనుకున్నారా?

వాసు : తొందరపడకు. నిదానిస్తే మర్యాద దక్కుతుంది. అతను మనయింట్లో ఉన్నన్నాళ్ళు ఉండడు. ఒకటి, రెండు రోజులలోనే వెళ్ళిపోతాడు. అతను వేరే చూసుకుంటూ ఉండగా, మనము తొందరపడి వెళ్ళమనటము మర్యాదగా ఉంటుందా? అందుకు నేనూ ఆలోచిస్తున్నాను గాని నాకు ఏసంగతి తెలియక కాదు.

3 వ రంగము

మాధ : వెంకయ్యా! కేశవరావుగారు నన్ను యిక్కడ కలుసుకొమ్మని చెప్పారు. ఇంతవరకూ రాలేదు. నేను రాకముందు వచ్చి వెళ్ళిపోయారా లేక అసలే రాలేదా?

వెంక : నేను చూడలేదండీ.

మాధ: వాళ్ళ యిల్లు ఎక్కడుందో చెప్పుతావా? నీకు పుణ్యముంటుంది.

వెంక: ముషీరాబాదులో, పెద్దరోడ్డు ప్రక్కన ఉన్న సందులో ఉన్నదండి. మిద్దెపైన ఉంటారు.

(పావుగంటతరువాత)

మాధవ : కేశవరావూ! కేశవరావూ! (తలుపు కొట్టాడు. లోపలినుండి మాటలు వినపడుతూ ఉంటాయి)

కేశ : ఎవరో వచ్చినట్లున్నారు. మాధవరావేనేమో! అతనికి ఇల్లు చూసి పెడతానన్నాను. ఎక్కడా దొరకలేదు. ఇబ్బందిగా ఉంటే మా యింట్లో వచ్చి ఉండమన్నానుగాని, దానికి అతను సిద్ధపడితే పెద్దచిక్కు వస్తుంది. నన్ను యింట్లోంచి లేచిపొమ్మన్నారని బొంకనన్నా బొంకాలి. అంతరాత్మను అణచిపెట్టుకొని కపటనాటకాలు ఆడితేనే గాని ఈపట్నవాసాలలో బ్రతికే విధానము కనబడదు. అయినా యింటికి వచ్చినవాడిని పలకరించకుండా ఎట్లా? (తలుపు తీస్తాడు) మాధవరావ్! నీవుటోయి! లోపలికి రా. ఇంటివిషయము అడగటానికే వచ్చావా? నీమాట అబద్ధమేమో నని నేనూ తిరిగాను. ఎక్కడా లేదన్నముక్క. అయినా పద, ఆ సందుయింట్లో ఒకచిన్న భాగము ఖాళీ అయిందనగా విన్నాను. కనుక్కుందాము పద. నాకీ సంగతి రాత్రే తెలిసింది.

మాధ : పదే అడుగుదాము. నాకు అద్దె ముంటే దొరుకుతుంది.

(అయిదు నిముషాల తరువాత)

కేశ : ఏమండీ! యింట్లో ఏదైనా ఒకచిన్న భాగము అద్దెకు దొరుకుతుందా? మా స్నేహితుడే ఈయన. ఇల్లుకొరకు చూస్తున్నాడు.

యిజ : ఇప్పుడేమీ ఖాళీగా లేవు. మొన్న ఖాళీఅయింది ఆ చిన్నభాగము కాని వెంటనే ఎవరో వచ్చి అడ్వాన్సు యిచ్చేశారు. రేపు వస్తారు ఆభాగములోకి.

కేశ : ఆభాగానికి బాడుగ ఎంత? రెండు మూడు గదు లున్నాయా?

(38-వ పేజీ చూడుడు)

# నాసిక్ కాంగ్రెస్ సమావేశ కర్తవ్యం

శ్రీ యస్. ఐ. త్యాగరాజు



ఇంతః పూర్వం జరిగిన భారతజాతీయ కాంగ్రెస్ సర్వసభ్యసమావేశాలు రెండూ ప్రజలకు కాంగ్రెస్ ఏమిచేస్తున్నదో ఎందు కున్నదో స్పష్టపరచజాలక పోయినవి. కేవలం పార్టీసభ్యులకోసం మాత్రమే కాంగ్రెస్ ఉన్నదనే అభిప్రాయం తప్ప మరొకటి తెలియరాలేదు. 1946 నవంబరులో మీరట్‌లో తుది పర్యాయం అఖండ భారతావనిలో కాంగ్రెస్ సమావేశమయింది. ముస్లింలీగ్ ఆరోజుల్లో ప్రభుత్వశక్తితో మంత్రివర్గంలో చేరి అనుసరిస్తున్న విధానంవల్ల దేశానికి పెద్ద ముప్పు - దేశవిభజన - సంభవించనున్నదని గ్రహించినప్పటికీ, కాంగ్రెస్ కార్యవర్గం, ఆలిండియా కాంగ్రెస్‌కమిటీలు చేసిన తీర్మానాల్ని సర్వసభ్యసమావేశం ఆమోదించింది.

దేశంలో అనేకచోట్ల చెలరేగిన మత కలహాల్ని అణచి మతద్వేషాల్ని అపనయించడానికి దేశవిభజన ఒక్కటే మార్గమని చెప్పి, ప్రజలచేత దేశవిభజనకు అంగీకరింపచేసింది కాంగ్రెస్. రాజకీయరంగంలో కాలు జారిపడి, ఆపైన దుర్ణయాలకు గురై యాతనలు పడుతున్న ప్రజానీకంపట్ల సానుభూతి తెలుపుతూ తీర్మానంమాత్రం చేశారు. భారతదేశం రిపబ్లిక్ వ్యవస్థ పొందిన తరువాత ప్రప్రథమంగా కాంగ్రెస్ నాసిక్‌లో సమావేశం కాబోతున్నది. రాజకీయదాస్యంలో మణిగి ఉన్నప్పుడు మనం కలలుగన్న స్వతంత్రభారతం నాసిక్ సమావేశంవల్ల సిద్ధించగలదా అనేదే ప్రశ్న.

## సమస్యలు *

కాంగ్రెస్ భవిష్యత్కర్తవ్యాన్ని నిర్ణయించుకోడంలో ఏ దేశంలోనూ, పాలనాధికారంలో ఉన్న ఏ పార్టీకీ ఇంతటి దుష్కరసమస్యల్ని, ఇంతగా యత్నలోపాలతో పరిష్కరించవలసిన అవసరం కలగలేదు. పరిపాలనావిషయాన్ని బట్టి చూస్తే గతంలో చెప్పుకోదగిన దేదీ కాంగ్రెస్ సాధించలేదు. గతాన్ని చూస్తూ కూచుంటే ఏదో సాధించినది కానరాక పోదు. దానికే అలసిపోయి, కర్తవ్యం నిర్వర్తించినట్లు తృప్తిపడినట్లయితే కాంగ్రెస్‌కి సర్వనాశనం తథ్యం. దాస్య బంధాలలో బంధింపబడిన భారతదేశం బంధాలను త్రెంచగలిగిన ఆనాటి కాంగ్రెస్ కాదీనాడున్నది; నడుము బిగించి దాడి కురకడానికి ఈనాడే సామ్రాజ్యబలమూ లేదు. పౌరు లందరికీ సమానహక్కులు సాధించిపెట్టడానికి కంకణం కట్టుకున్న సంస్థ అనే పేరు సార్థకం చేసుకోనూ లేదు. స్వాతంత్ర్యం సిద్ధించినతరవాత గాంధీజీ ఆశించినట్లు కాంగ్రెస్ లోకసేవా సంఘంగా పరిణతి పొంది ఉన్నట్లయితే, దేశంలో దారిద్ర్యం, అజ్ఞానం, భీతి, లేమి నివారించడానికి విప్లవాత్మకమైన గతచరిత్ర మార్గదర్శి కాగలిగేది. కాని ఈనాడు కాంగ్రెస్ పాలనాధికారం చేగొన్న పార్టీ అయింది కాబట్టి వీని నివారణకు జరిపే కృషిలో అప్పుడప్పుడు ప్రజల సహకారం పొందజాలక పోతున్నది.

## రాబోయే ఎన్నికలు *

ఏడాదిలో రానున్న ఎన్నికల్లో ఎలా పోటీ చెయ్యాలనే సమస్యను నాసిక్ సమావేశం చర్చించి తీరుతుంది. ఈ సమస్యను సంస్థ నిర్మాణరీత్యా కూడా పరిష్కరించడానికి ప్రయత్నిస్తారని తెలుస్తునే ఉన్నది. నాయకులూ కాంగ్రెస్ కార్యకర్తలూ కలహాల్లో మునిగి ఉన్న వ్యక్తుల్ని వర్గాల్ని సమాధానపరచడానికి శతధా కృషిచేస్తున్నారు. చెదరి దూరమైపోయిన సంస్థలో వివిధఅంగాల్ని తిరిగి కూర్చిసౌష్టవమైన సంస్థగా రూపొందించడానికి యత్నాలు జరుగుతున్నాయి. గత నాలుగేళ్ళలో ఎన్నడూ కానరానట్లుగా కొన్నిమాసాలుగా వివిధకార్యకలాపాలలో ప్రభుత్వాలూ కాంగ్రెస్ కమిటీలమధ్య సామరస్యం సాధించడం ప్రధానమనే విషయాన్ని నొక్కినొక్కి చెప్తున్నారు. అనుకున్న వ్యవధిలో జరగని కాంగ్రెస్ఎన్నికల్ని ఏదోరీతిని కొనసాగించడానికి ప్రత్యేకఏర్పాట్లు జరుగుతున్నాయి. సంస్థకు సంబంధించిన ప్రతి విషయంలో, క్రమశిక్షణ, నియమాతిక్రమణకు శిక్ష మొదలైన కర్తవ్యాలలో, సంస్థ అవసరాలను గమనిస్తున్నారు. రానున్న సంవత్సరం జరగబోయే ఎన్నికల్లో 17 కోట్ల వోటర్ల ఆదరాన్ని సంపాదించడానికి కృషి చేస్తున్నారు.

## ఎన్నికల నివేదిక *

గత ఏప్రిల్లో వివిధరాష్ట్రాల ముఖ్యమంత్రుల్ని రాష్ట్రకాంగ్రెస్‌అధ్యక్షు కార్యదర్శుల్ని. న్యూఢిల్లీలో కాంగ్రెస్ అధ్యక్షులు సమావేశపరిచి చేసిన తీర్మానాలు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన ఆదేశాలు, ప్లానింగ్ కమిషన్ నియామకం, కాంగ్రెస్ ప్లానింగ్ సబ్‌కమిటీ నియామకం మొదలైనవి, కాంగ్రెస్ నిర్వహించనున్న ఆర్థికపారిశ్రామికపాలనావిధాన నిర్ణయానికి ప్రాతిపదికలు. ఈ విధానమే చివరికి కాంగ్రెస్ ఎన్నికల నివేదికగా వెలువడుతుంది. పార్టీని ఏవిధంగా పునరుజ్జీవితం చెయ్యాలి; ఎలా ప్రజల విశ్వాసాన్ని పొందాలి అని కాంగ్రెస్ తీవ్రంగా యోచించడం సముచితమే. దేశాన్ని ఏరీతిగా పరిపాలించాలో ఒక విధానాన్ని నిర్ణయించడం కూడా అవసరమైనదే.

కాని జరగబోవు సర్వసభ్యసమావేశం ఎన్నికల నిమిత్తం అవసరమై ఈ కనీస కర్తవ్యంతోనే తృప్తిపడినట్లయితే మీరట్, జైపూర్ సమావేశాలకు పైన ఒక్క అడుగైనా ముందుకి వెయ్యలేరు.

## ప్రతినిధుల కర్తవ్యం *

సంస్థాబలం, ఎన్నికల దృష్ట్యా కర్తవ్యం నిర్ణయించుకోడమే కాకుండా, ఎవరి అనుమతిపై పాలనాధికారాన్ని చేగొంటున్నారో వారి యోగక్షేమాల్ని ఎన్నడూ మరువకూడదు. ప్రజలకూ నాయకులకూ మధ్య సాన్నిధ్యం చేకూర్చే కాంగ్రెస్‌సమా

(40-వ పేజీ చూడుడు)




మూలం :

## సుమథ్‌నాథ్ ఘోష్

అనువాదం :

## శ్రీ నన్నపనేని సుబ్బారావు.

భర్త యెలా వుండాలా అని ప్రతిబాలిక తన మనస్సులో వూహించుకొంటూ వుంటుంది. కొంతమందికి అదృష్టబలంకొద్దీ కల్పనానుగుణ్యామైన భర్తలు లభిస్తారు. కొంతమందికి అదృష్టం కలిసిరాదు. వాళ్లు చాటుగా వొక్కయేడ్పు యేడ్చి వూరుకుంటారు. కాని ఆ కల్పనలోని నిగూఢ సత్యాన్ని కించిత్తుకూడా సందేహించటానికి వీల్లేదు. బాలికలు తరుణ తరళతలో, దీనినిగురించే రకరకాల చిత్రాలు లిఖిస్తూ, చెరిపివేస్తూ వుంటారు. అనాది నించీ ఇది యిలానే జరుగుతూ వస్తూంది.

ఇది అనివార్యంకూడా. ఎందువల్లనంటే బాలికల వివాహం మూడుముళ్లు పడగానే పూర్తి అయినట్టుకాదు. వాళ్ల తిండితిప్పలు మంచిచెడ్డలు, కష్టసుఖాలు, భవిష్యత్తు సమస్తమూ భర్తపైన ఆధారపడి వుంటుంది. అందువల్ల వివాహానికి, యెక్కడ లేని విలువ చేకూరింది. అమల విషయంలో దీనికి ఇంకాయెక్కువ ప్రాముఖ్యం వుంది. ఆమెతండ్రి స్థితిపరుడు. ఆమెఅందగత్తె కాకపోయినా, బాగానేవుంటుం దని చెప్ప వచ్చు. ఆమె ఉన్నతవిద్య నభ్యసించింది; రెండు మూడుడిగ్రీలు వున్నవి; సితారు వాయిస్తుంది; పాడగలదు. నృత్యంకూడా చేస్తుంది. ఆమె యెన్నో స్వప్నాలు కంటూ వుంది వివాహాన్ని గురించి.

చిక్కు వచ్చింది కూడా ఇందువల్లనే. తల్లిదండ్రులికి నచ్చినవ్యక్తి, తనకి నచ్చడు. రాత్రులు మంచంపైన పరుండి స్వప్నలోకంలో విహరిస్తూవుంటుంది. పెళ్లిళ్లుఅయిన స్కూలు కాలేజి చెలికత్తెల భర్తల సంగతి పదే పదే తలపుకుతెచ్చుకుంటుంది. కాని వాళ్లలో ఒక్కరూ యోగ్యులుగా కనిపించటంలేదు. తన భర్త ఆ చెలికత్తెల భర్తలందరికంటె అన్నివిధాలా యోగ్యుడుగా వుండాలని ఆమెకోరిక. అందువల్ల అమలదిగులుకు అంతూ దరీ లేకుండా వుంది. అందరికంటె మిన్న అనిపించుకోటానికి, భర్త యేలా వుండాలా అని యెంత ఆలోచించినా, ఆమె ఒక నిర్ణయానికి రాలేకపోతూవుంది

డాక్టర్లు, లాయర్లు, ప్రొఫెసర్లు లక్షాధికార్లు—నిత్యమూ ఏన్నో సంబంధాలు వస్తున్నవి. లక్షాధికార్ల సంబంధాలన్నీ యేకైక పుత్రులవే! కాని అమలమనస్సు యెటూ మొగ్గలేకపోతూవుంది. డాక్టరనగానే, ఒక స్నేహితురాలి భర్త గుర్తొస్తాడు. ఆమె తండ్రి ఆమెకు డబ్బు పంపుతుంటాడు. దానితోనే ఆమె భర్త సూట్లు కుట్టించుకుంటాడు, సిగిరెట్లుకాలుస్తుంటాడు. ఈనాటికీ, యెర్రని యేగాని సంపాదించి యెరగడు. సూటు వేసుకుని, ఖాళీ సిగరెట్టు టిన్ను, టేబిలుమీదకొడుతూ మెడలో స్టెథస్కోపు వేసుకొని, డిస్పెన్సరీలో కూచుంటాడు. కాలం గడవనప్పుడు, వైద్యగ్రంథం తెరచి, దానిమధ్య, వొకబొకు డిటెక్టివ్ నవల పెట్టుకుని, చాటుమాటుగా చదువుతూవుంటాడు.

తర్వాత అమలకి తన పినతల్లికూతురు సంగతి గుర్తొచ్చింది. ఆమెభర్తకూడా

డాక్టరు; కాని అతనికి భార్యతో కులాసాగా రెండుమాటలు మాట్లాడటానికయినా, తీరిక వుండదు. అర్థదాహం జాస్తి. ఇలాంటి వ్యక్తి తుచ్చుకుకూడా కోరకడు. బంధువుల యిళ్లకికూడా పెట్రోలు డబ్బులు పుచ్చుకోకుండా, రోగిని చూడటానికి రాడు. చాల కటువుగా మాట్లాడతాడు. తను యేదో వున్నతశిఖరంమీద వున్నట్లు వ్యవహరిస్తాడు. నర్సులతో, మిడ్‌వైఫ్‌లతో, చెడతిరుగుతాడని గోల! పాపం, అతనిభార్య, యీ సిగ్గుతోటే అయినవాళ్ల యింటికి వెళ్లటానికూడా సమ్మతించదు.

ఇంద్రబాబుతోమాత్రం యెవర్నీ పోల్చటానికి వీల్లేదు. అతను యేకపత్నీవ్రతుడు. ప్రతిమని తప్ప అన్య మెరుగడు. సజ్జనుడు, కాని ఇలాంటి భార్యాలోలుణ్ణి చూస్తే, ఆమె మనస్సు అసహ్యంతో నిండిపోతుంది. భార్యని కూచోబెట్టి, పొయ్యి రాజేస్తాడు. కూరలు తరుగుతాడు. భార్య జన్మజన్మాంతరాలకీ అతడేతన భర్తకావాలని కోరుకుంటున్నట్లు చెప్పినపుడు, అమల లోలోపల ఛీ, ఛీ అనుకుంది.

ఇలా, రాత్రిళ్లు కాబోయే భర్తగురించి ఆలోచించినకొద్దీ, అమల నెర్వస్ నెస్ ఫీలవుతూవుంది. తనకి ఇలాంటివాడే దొరకుతాడేమో! అటువంటప్పుడు అవివాహితురాలుగా వుండిపోవటమే కోటిరెట్లు నయం! ఇలాంటివ్యక్తితో తను యెలాగూగడపలేదు!

భువనబాబుసంగతి గుర్తుకొచ్చినపుడు, ఆమెకు మరీ బాధ కలుగుతుంది. ఇంత కల్చరువున్న వ్యక్తులు చాలా అరుదు! కాని వొకరోజు మాలతిని కలుసుకుందామని వెళ్లితే భువనబాబు కింద కూచుని, పసిపిల్లకి అన్నం పెడుతున్నాడు. ఇదిసహించినా, అతనిమీద కలిగిన అభిప్రాయాన్ని మార్చుకోనక్కర లేదు. ఉదాహరణకి మరొక విషయం పేర్కొనవచ్చు. మాలతితనను టీకి ఆహ్వానిస్తే, ఒకసారి వెళ్లింది. భువనబాబు పవిత్రాపవిత్రతలను నిర్దేశించే తల్లిముందర చిన్న అంగోస్త్రం చుట్టికొని నిలబడివున్నాడు. తల్లి వచ్చి శిరస్సుమీద గంగాజలం చిలికే వరకు, లోపలికి వెళ్దామనే భావమే అతనికి కలిగినట్లులేదు. ఆనాటినుంచే భువనబాబంటే ఆమెదృష్టిలో విలువ లేకుండాపోయింది. అందరికంటే మాలతితోనే ఆమెకి యెక్కువ దోస్తీ! ఇద్దరూ చాలా అన్యోన్యంగా వుంటారు. మిడిల్‌స్కూలునించి ఫస్ట్ ఇయర్‌దాకా కలిసి చదివారు. ఇద్దరూ ఒకేబస్సులో వస్తూ, పోతూ కబుర్లు చెప్పుకుంటూ వుండేవాళ్ళు. ఆ రోజు మాలతిని పక్కగదిలోకి పిలిచి - నువ్వు ఇదంతా యెలా సహిస్తున్నావు?, అని అడిగింది.

జవాబు చెప్పేటప్పుడు మాలతి కంఠస్వరం కంపించింది——"ఇంకా నువ్వు యేంచూసినట్లు అమలా? ఈ అత్తగారి మూలాన రోజూ మూడుసార్లు స్నానం చేయాలసివస్తూంది."

అమల విస్మితకంఠంతో —— "కాళ్లూ చేతులూ కొంకర్లుపోయే ఈ చలిలో నా?... అమ్మయ్యో, అయితే యమయాతనే!" అంది.

మాలతి కనుకొలకుల్లోనించి, రెండు కన్నీటిచుక్కలు రాలినై. "నేను రోజూ పొటాసియమ్ సైనేడ్ తిని చచ్చిపోతే బాగుంటుం దనుకుంటాను."

అమల క్షణకాలం వూరుకుని——"భువనబాబుతో చెప్పక పోయావా?" అన్నది.

మాలతి కన్నీరు తుడుచుకుని.—— "యెందుకు చెప్పలేదు? యెన్నిసార్లు చెప్పినా వారి నోటిమీదుగా వొకే జవాబు వస్తుంది. 'తల్లి వున్నన్నాళ్లు ఆమెయిష్టప్రకారం పోవలసిందే! ఆమెని కాదనటం బాగుండదు. యిదంతా సహించలేకపోతే, పుట్టింటికి వెళ్లివుండు. ముసలితల్లిని నేను యెలా వదలిపెట్టను?' "అని చెపుతూండగానే ఆమె నేత్రాలు కన్నీటితో నిండిపోయినవి.

మళ్ళీకొంచెం ఆగి——"నా తల్లిదండ్రులు యెంతడబ్బు ఖర్చుపడి పెళ్లిచేసిందీ నీకు తెలుసు... పెళ్లి వొకరకంగా లాటరీ అని చెప్పవచ్చు. అమలా, నిన్ను ముందుగానే జాగ్రత్త పడమని హెచ్చరిస్తున్నాను." అని చెప్పి, మాలతి దీర్ఘంగా నిట్టూర్చింది.

మాలతివంటి నవనాగరికురాలికి యెంత దుర్గతి పట్టింది! అమల ఆమె సంగతి తల్చుకుని, చాలా వుద్విగ్నురాలై బాగా పొద్దుపోయేవరకు నిద్రపోలేకపోయింది.

అరుణబాబునుమాత్రం సరైన వ్యక్తి అని చెప్పవచ్చు. పక్కాదొరలా వుంటాడు. సూటు వేస్తాడు. యెప్పుడు నీటుగావుంటాడు. సూటు కొంచెం నలిగితేచాలు తీసివేసి కొత్తది వేస్తాడు. ఆజానుబాహువు; బంగారపుచాయ, పెదవుల మధ్య పైపు పెట్టుకుని ఇంగ్లీషులో కమ్మగా మాట్లాడుతుంటే, సురమఅదృష్టానికి, అమల యీర్ష్యపడేది. నిజంగా సురమ అదృష్టవంతురాలు! చదువుమీద ఆమెకిధ్యాసే వుండేదికాదు క్లాసులో. చూడటానికయినా, బాగుండదు. ఆమె అదృష్టంకొద్దీ, సెకండ్ ఇయర్ చదువుతూండగానే తండ్రి గొప్పవాడు కావటంచేత యీ వివాహం జతపడింది. అరుణబాబు విదేశాల్లో ఇంజనీరింగు చదువుకొచ్చాడని, అమల అతన్ని చాలా శ్రద్ధగా చూసేది. కాని అతను వొక యంత్రాగారంలో పనిచేస్తున్నాడని వినగానే ఆ శ్రద్ధకాస్తా యెగిరిపోయింది. పొట్టకోసినా, అక్షరంముక్కలేని కార్మికుల మధ్య నివాసం! కార్మికచక్రవర్తి కావటం గొప్పవిషయ మేమీ కాదు!

అమలతండ్రి, ప్రొఫెసరు ప్రసక్తి తెచ్చాడు. అప్పటికీ ఆమె తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు. ప్రొఫెసర్లు ఆమెదృష్టిలో విచిత్ర జీవాలు. వారిని విద్యాభారాన్ని మోసే గార్దభాలంటే చక్కగా అతికినట్టుంటుంది. నేత్రాల్లో, ముఖంలో, చురుకు అనేది కన్పించదు. కళ్లకి జోళ్లు, వదులుచొక్కా మీద మురికిపోడే శాలువ! అడుగులు లెక్కపెట్టే నడక! చంకలో పుస్తకాల కట్ట! పాపం నవ్వుఅనేది యెరగరు. సరసతకి మైళ్ల దూరాన వుంటారు! ప్రపంచభారమంతా తమనెత్తిమీద పడినట్లు పోజు పెడతారు. ఈసందర్భంలో నీలిమభర్తసంగతి జ్ఞప్తికి రాగానే, అమల ఇప్పటికీ నవ్వుకుంటుంది. ఒకరోజు ఆ ఇంగ్లీషుప్రొఫెసరుతో కులాసాగా మాట్లాడాలని వెళ్లింది. కాని ఆయన భీరువుమాదిరి అమలవంక చూస్తున్నాడు. ఈపరిస్థితిలో ఆయనతో మాట్లాడేది యెలా!

అమల——"భయపడమాకండి. నేను మీ స్టూడెంటుని కాదు! నాముఖంవంక చూపి మాట్లాడితే మీకులం పోదు."

ఆపెద్దమనిషి అతికష్టంమీద ఆమెముఖం వంక చూస్తూ "యేమన్నారు" అన్నాడు.

ఇంతలో నీలిమ, గదిలోకి వస్తూ—— "అమ్మో! ఇంకా అనేదేముంది.? అదిమీకు మరదలు అవుతుంది! మరదలి అందం చూసి, మతి భ్రమించిందా?" అన్నది.

ఆ పరిహాసంలో అమలకూడా శ్రుతికలప వలసివచ్చింది. తర్వాత నవ్వు ఆపుకొని—— "సరేగాని, రాయ్‌గారూ, మా అక్కయితో మాట్లాడేటప్పుడు, యెటు చూస్తుంటారు?" అన్నది అమల.

ఆయన సన్నని గొంతుతో—— "మీఅక్కాయి యెదటే కూచునివుంది. ఆమెనే అడగకూడదూ?" అన్నాడు.

నీలిమ ముఖం కొంచెం పక్కకి పెట్టి—"ఇలాంటివి మా ఇళ్లలో చెప్పకూడదు!" అన్నది.

అమల ప్రశ్నించింది—"యెందువల్ల?... అప్పుడు కూడా స్టూడెంటుతో మాట్లాడుతున్నా ననుకుంటారా?"

నీలిమ—"నీకు తెలియదా? సినిమాకి యెన్నడూ వెళ్లరు. ఎవరైనా స్టూడెంటు చూస్తే, యింకేముంది? దురభ్యాసాలు అలవడత వేమో నని కిళ్లీ సిగిరెట్టు ముట్టరు. సన్న గుడ్డ కట్టరు. అది వీరి దృష్టిలో విలాసం కింద లెక్క!"

అమల—"ఏమండి, రాయ్ గారూ! ప్రొఫెసరీ చేసేటప్పుడు, ప్రపంచంలోని ఆమోదప్రమోదాలకి దూరంగా వుండమని యెక్కడైనా వ్రాసివుందా?'

ఈసారి ఆయన ముఖ మెత్తి—మనదేశం సంగతి నాకు సరిగ్గా తెలియదుకాని విదేశాల్లో మాత్రం ప్రొఫెసర్లు సన్యాసులవలె జీవితాన్ని గడుపుతుంటారు." అన్నాడు.

అమల వెంటనే—"మీకు ఇది తెలిసి వుండి, మా అక్కాయిని దేనికి పెళ్లి చేసుకున్నారు?" అన్నది.

"ఇదేగదా నాజీవితంలో చేసిన పెద్ద తప్పిదం! ఇప్పటి కయినా గూండాలు యెత్తుకపోతే, నాప్రాణాలు కుదుటబడతయ్" అన్నాడు రాయ్.

అమల ఆలోచనా ప్రవాహానికి మరొక నెచ్చెలి భర్తవిషయం అడ్డు తగిలింది. ఆయన వకీలు. పీక్కుపోయిన కోలముఖం. మాంధాతలనాటి పంట్లాము, రంగువెలిసిన నల్ల కోటు, చేతిలో దుమ్ము పట్టిన ఫైల్సు! రోజూ ట్రాముమీద వెళ్లి మునసబుకోర్టుకు హాజరవుతాడు. అక్కడ పడిగాపులు కాసి, నాలుగైదు కేసులు సంపాదిస్తాడు. ఉచ్ఛఆకాంక్ష అనేది అతని జీవితానికి వున్నట్టే లేదు. క్లయింటుని పట్టుకుని, పీడించో, భయపెట్టో, అబద్ధాలు చెప్పో, వీలున్నంతవరకు డబ్బు గుంజుతాడు. ఆ వకీలుయిల్లు, అమలయింటికి ఆనుకునే వుంది. ఒకనాడు - ఆయన, క్లయింటువద్ద యెలా డబ్బు వసూలు చేసిందీ కళ్లార చూసినప్పటినించీ, అమలకి అతని చదువుసంధ్యలమీద, సంస్కారంమీద తగని చీదర వేసింది. క్లయింటు నాదగ్గర ప్రస్తుతం డబ్బు లేదంటాడు. వకీలుగారు 'గుడ్డలుదులుపు, యేపక్కనో దాచివుంటావు' అంటారు. చివరికి క్లయింటువద్ద రెండు రూపాయలు గుంజిగాని, విడిచిపెట్టలేదు.

ప్లీడరీ అంటేనే, అమలకు గిట్టదు. అంతకంటె, అర్థాకలితో కృశించి చావటం మెరుగు. భర్త జీవనోపాధి గౌరవప్రదమయినది కాకపోతే, అందులో తను స్వీకరించవలసినది కించిత్తుకూడా ఉండదు.

(36-వ పేజీ చూడుడు)



★

# స్వాతంత్ర్య దిన మహోత్సవం

★



స్వాతంత్ర్య దినమహోత్సవం ఢిల్లీ ఎర్ర కోటవద్ద పతాకారోహణోత్సవం జరిపిన ప్రధాని నెహ్రూ.

★

స్వాతంత్ర్య వార్షికోత్సవమునాడు మదరాసుగవర్నరు భావనగరుమహారాజాగారు సైనికవందనము గైకొనిరి ప్రధానమంత్రి, తిరువాంకూరు సేనాధిపతి, అంగరక్షకులు చుట్టు నిలచియున్నారు







కేంద్ర మంత్రి మండలి

కూర్చున్నవారు:—(ఎడమనుంచి కుడికి) శ్రీ శ్రీప్రకాశ్ (వాణిజ్యమంత్రి), శ్రీ హరిక్రృష్ణ మెహతాబ్ (పారిశ్రామిక మంత్రి), శ్రీ వి గాడ్గిల్ (గనులు, పనులు, విద్యుచ్ఛక్తిమంత్రి), రఫీఅహమ్మదు కిద్వాయి (తంతి తపాలామంత్రి); సర్దార్ బలదేవసింగ్ మంత్రి); శ్రీ సర్దార్ వల్లభాయిపటేలు (ఉపప్రధాని); శ్రీ పండిట్ జవహరిలాల్ నెహ్రూ (ప్రధాని); శ్రీ సి. రాజగోపాలా (పోర్టుఫోలియోలేని మంత్రి); శ్రీ జగ్జీవన్‌రాం (కార్మికమంత్రి), డా॥ అంబేద్కర్ (న్యాయమంత్రి), శ్రీ యన్ గోపాలస్వామి ంగార్ (రైల్వే రవాణాలమంత్రి), శ్రీ కె యం. మున్షీ (ఆహార, వ్యవసాయమంత్రి); శ్రీ సి డి. దేశముఖ్ (ఆర్థికమంత్రి).



గురుస్మరణ—స్వాతంత్ర్యోత్సవశుభదినాన డాక్టరు రాజేంద్రప్రసాద్‌గారు రాజఘాటుకు వెళ్లి, గాంధీజీ పవిత్ర సమాధివద్ద శ్రద్ధాభక్తులతో పూలగుత్తులు అర్పించి బాపూజీని స్మరించారు.

సినీమా : 23.8.50

# 'మహల్'





బొంబాయి టాకీసువారి 'మహల్' లో నాయకపాత్రధారి అశోక్‌కుమార్.

బొంబాయి టాకీస్ వారి హిందీ చిత్రం. దర్శకుడు, కథకుడు: కమాల్ అమ్రోహి. సంగీతదర్శకుడు: ఖేమ్‌చంద్ ప్రకాశ్.

తారాగణం అశోక్ కుమార్, మధుబాల, విజయలక్ష్మి మొదలైనవారు.

ఛాయాచిత్రణం, శబ్దగ్రహణంపైన పూర్తిగా ఆధారపడి కథను నిర్వహించిన చిత్రాలింతవరకూ మనదేశంలో అట్టే నిర్మాణం కాలేదనే చెప్పాలి. పైరెండింటిలోనూ భారతదేశచలనచిత్రపరిశ్రమలో కెల్ల అద్వితీయులైన బొంబాయి టాకీస్ వారు అపూర్వకళానైపుణ్యాన్ని 'మహల్' చిత్రంలో ప్రదర్శించి, కేవలం దానివల్లనే కథకు ప్రాణం పోసి కథను నిర్వహించడానికి ప్రయత్నం చేశారు. ఛాయాచిత్రణలో గాని శబ్దగ్రహణంలో కాని ఏపాటి లోపం వచ్చినా కథకు అర్థం లేకపోతుంది.

అయితే 'మహల్' చిత్రంలో పెద్ద లోపమేమిటంటే, ప్రశంసాపాత్రమైన ఈ యత్నంలో ఛాయాచిత్రణ, శబ్దగ్రహణాలతో సమానంగా కథ తూగలేకపోయింది. ఎంచిన కథావస్తువు అనువైనది కాబట్టి, కథారచన ఎంత లోపభూయిష్టంగా ఉన్నప్పటికీ చాలవరకూ కథను ఛాయాచిత్రకారుడు శబ్దగ్రాహకుడు రసవంతంగా నడపగలిగారు. భ్రమను పూర్తిగా లోబడినట్లు మనసు అసంభవాలు సంఘటిల్లగలవని నమ్మేస్థితిలో ఉన్నప్పుడు ఎట్టి వాతావరణంలో పరిభ్రమిస్తుందో ఆ వాతావరణం అద్భుతంగా చిత్రించబడింది. కాని చివరికి కథారచనలోని లోపం రసభంగం కలిగించింది.

కథ ఒక పురాతనభవనానికి సంబంధించినది. గంగా యమునలు కలిసేచోట ఎప్పుడో నిర్మించబడిన సంగమభవనంలో ఒక కామిని సంచరిస్తూ ఉంటుందని కల ప్రవాదం విని ఆ భవనాన్ని కొన్న ఒక భాగ్యవంతుని కుమారుడు శంకర్ (అశోక్‌కుమార్) కామిని కిటుకు తెలుసుకోవాలని భవనానికి వస్తాడు. అక్కడ తోటమాలివల్ల భవననిర్మాత కథ వింటాడు. పూర్వం ఒక రాజు తన ప్రియురాలు 'కామిని' కోసం నిర్మించిన ఈ భవనంలో, వివాహం జరిగినరోజున హత్య గావింపబడ్డాడు. కామిని చనిపోయిన తరువాత కూడా మహల్లో సంచరిస్తూ ఉంటుందనే ప్రవాదంవల్ల ఎవరూ ఆ భవనంలో నివసించడం లేదు.

శంకర్ భవనంలో ప్రవేశించిన కొంతసేపటికి భవనప్రాంగణంలోనే ఒక స్త్రీ గానం వినపడుతుంది. పాట వినటంతో వ్యామోహితుడైన శంకర్ పాట వినవస్తున్న దిక్కుగా వెతుకుతాడు. 'కామిని' బారినుంచి శంకర్‌ను కాపాడాలని అతని మిత్రుడు శ్రీనాథ్ అనేకవిధాల యత్నించి విఫలుడౌతాడు. మంత్రముగ్ధునివలె శంకర్ భవనోద్యానం ప్రవేశించి అక్కడొక స్త్రీని చూస్తాడు. (మధుబాల) శంకర్ కోసమే ఆమె చిరకాలంగా నిరీక్షిస్తున్నట్లు చెప్తుంది. శంకర్ శ్రీనాథ్ భవనంలోకి తిరిగి వచ్చినతరవాత ఆమె అకస్మాత్తుగా అక్కడ ప్రత్యక్షమౌతుంది. శ్రీనాథ్ పిస్తోలు పేల్చినా అది ఆమెకు తగలక కిటికీ అద్దం బద్దలౌతుంది. శ్రీనాథ్ విసిగి శంకర్ తండ్రివద్దకు వెళ్లినసమయంలో శంకర్ కామినిని చూస్తాడు. చిరకాలంగా తాను నిరీక్షిస్తున్నట్లు పూర్వపురాజే శంకర్‌గా జన్మించినట్లు అతనికి చెప్తుంది. తరతరాలుగా నిరీక్షిస్తున్న తన ప్రేమను పొందాలంటే శంకర్ మృత్యువుఅనంతరమే సాధ్యపడుతుందనీ అలా కానిపక్షంలో, తోటమాలి కుమార్తెను చంపినట్లయితే ఆమె శరీరంలో తాను ప్రవేశించగలదని 'కామిని' చెప్తుంది. శంకర్ నమ్ముతాడు. తోటమాలికుమార్తెను చంపదలచుకున్న సమయంలో అతనితండ్రి శ్రీనాథ్ వస్తారు. ఇద్దర్నీ తప్పించుకోబోయి శంకర్ మెట్లపైనుంచి పడిపోతాడు. తండ్రి శంకర్‌ను ఇంటికి తీసుకెడతాడు. కొన్నాళ్లకి శంకర్‌కి వివాహం జరుగుతుంది. కాని రంజన అతని ప్రేమను పొందలేకపోతుంది. మనశ్శాంతికోసం కొన్నాళ్లు ఇద్దరూ సమీపంలోని కొండల్లో తిరుగుతారు. కాని శంకర్ మనస్సు మారదు. అతని మనోగత విషయాన్ని గ్రహించాలని రంజన ఒక యుక్తి పన్నుతుంది. తాను లోతులో పడి ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఉత్తరం వ్రాసి నిద్రపోతున్న శంకర్ ప్రక్కన పెట్టి చాటున దాగుతుంది. శంకర్ ఉత్తరం చూసుకొని స్వేచ్ఛ లభించినట్లు భావించి వెంటనే మహల్‌కు వెడతాడు. అతనికి తెలియకుండా రంజన వెంబడిస్తుంది. శంకర్ మహల్ చేరి తానింక మృత్యువుకు సిద్ధంగా ఉన్నట్లు కామినితో చెప్తాడు. ఆమె మళ్ళీ తోటమాలిని చంపమని ఆదేశిస్తుంది. ఇది విని రంజన నిరాశ చెంది వెళ్లిపోతుంది.

ఇంతవరకూ కథ మంచిపటుత్వంతో నడిచి తరవాత బోర్లపడింది. రంజన ఆత్మహత్య చేసుకుంటున్నట్లు వదినెగారికీ ఉత్తరం వ్రాసి విషం మింగుతుంది. పోలీసు స్టేషన్‌కి వెళ్లి శంకర్ మహల్‌లోని ఒక స్త్రీమాయలో చిక్కి తనకు విషం పెట్టినట్లు ఫిర్యాదు చేసి చనిపోతుంది.

శంకర్ మళ్లీ తోటమాలికుమార్తెను చంపడానికి ఉద్యుక్తుడై ఉన్నసమయంలో పోలీసులు వచ్చి ఆమెను శంకర్‌ను అరెస్టు చేస్తారు. అరెస్టు చేసినప్పుడు తోటమాలి కూతురే ఇన్నిరోజులుగా తనను ప్రేరేపిస్తున్న కామిని అని శంకర్‌కి తెలుస్తుంది.

భార్యను హత్యచేసిన నేరానికి శంకర్‌పై కోర్టులో విచారణ చేసినప్పుడు కామిని తనసంగతి తెలుపుతుంది. తోటమాలి కూతురైనందువల్ల మహల్ యజమాని ప్రేమ తనకు లభించదనీ, అది తెలిసి ఈవిధంగా యుక్తి పన్నిందనీ బయట

చెపుతుంది. కాని పూర్వపు రాణి కామిని తోటమాలికూతురుగా జన్మించిందనీ, తానే పూర్వజన్మలో భవననిర్మాతయైన రాజనీ, శంకర్‌కి కలిగిన దృఢవిశ్వాసం చలించదు. శంకర్‌కి మరణదండన విధించబడుతుంది. తోటమాలికుమార్తెను వివాహం చేసుకోవలసిందిగా మిత్రుడు శ్రీనాథ్‌ని శంకర్ బలవంతపెడతాడు ఇంతలో రంజన వదినెగారికి వ్రాసిన ఉత్తరం పోలీసులకు చేరుతుంది. శంకర్ హంతకుడు కాడని తేల్తుంది విడుదలై మహల్‌కి వస్తాడు. కాని అప్పటికే ఆమెవివాహం శ్రీనాథ్‌తో జరిగిపోతుంది, శంకర్ ప్రాణాలు విడుస్తాడు. కామిని యమునానదిలో పడి ఆత్మహత్య చేసుకుంటుంది.

భ్రమకులోనైన మనసు, భర్తప్రేమను పొందలేక రంజన అనుభవించిన ఒంటరితనం, మహల్ మాయావాతావరణం చిత్రంలో మరువరానివిధంగా చిత్రించబడినాయి.

---

# 'మత్స్యరేఖ'

శ్రీ సుకుమార్ ప్రొడక్షన్స వారి తమిళ చిత్రం, దర్శకులు: పి. పుల్లయ్య.

తారాగణం: టి. ఆర్. మహాలింగం, ఎస్. వరలక్ష్మి పి. శాంతకుమారి, బి. ఆర్ పంతులు మొదలైనవారు.

సుకుమార్ ప్రొడక్షన్స్ వారి 'మత్స్యరేఖ' పి. పుల్లయ్యగారు దర్శకత్వంలో ఘటికుడే ననీ, టి ఆర్. మహాలింగం నాయకపాత్రలకంటే, దుష్టపాత్రలను బాగా నిర్వహించగలడనీ, పి. శాంతకుమారి పెద్దఇల్లాలు భూమికలను బాగా అభినయించగల దనీ నిరూపించింది.

ఒక రాజాఆస్థానంలో సర్వాధికారిగా వుంటున్న వ్యక్తి రాజద్రోహం, నమ్మకద్రోహం చేసి, కుతంత్రంతో రాజై భోగలాలసుడై ప్రజలను బాధించడం, తుదకు ద్రోహానికి గురిఅయిన రాజకుమారుడే వేరొకచోట పెరిగి పెద్దవాడై, ప్రజల అండదండలతో గడియగా అతని చేతులలో పరాభూతుడు కావడము ఈ చిత్రంకథలో ముఖ్యాంశం. ఈ అంశానికి, ప్రజారంజనకు అవుసరమని తోచిన మరికొన్ని అంశాలను ముడిపెట్టి చిత్రాన్ని మొత్తంమీద రంజకంగానే తీశారు. సర్వాధికారిభూమికనూ, రాజకుమారుని పాత్రనూ కూడా మహాలింగం నిర్వహించాడు. అందులో మొదటి భూమికను చాలా ప్రశంసనీయంగా నిర్వహించాడు. కంఠస్వరంలో జీరకొంచెం తక్కువగావున్నట్లయితే ఆ భూమికానిర్వహణ మరింత రాణించేది. సర్వాధికారి దుస్తంత్రంవల్ల భర్తను కోల్పోయి, బిడ్డను ఎడబాసిన రాణి భూమికను శాంతకుమారి బహుచక్కగా నిర్వహించింది. ఆమెకు దుఃఖ సమయంలో పాటలు కొంచెం తగ్గించినట్లయితే మరీ బాగుండేది

తల్లినుంచి ఎడబాటుచెంది, ఆటవికులైన తలిదండ్రుల చేతులలో చిక్కి, తనవల్ల రక్షింపబడ్డ రాకుమారుని ప్రేయసిగా ఎస్. వరలక్ష్మి చక్కగా ఆడి, పాడి ప్రేక్షకులను అలరిస్తుంది ప్రణయఘట్టాలలో మహాలింగం వరలక్ష్మి చాలా స్వేచ్ఛగా, బెరకు ఏమీ లేకుండా నటించారు ఇది మన చిత్రాలలో అపరూపం కనుక విశేషమే ననవచ్చు.

వర్తమానకాలంలో జరుగుతున్న చరిత్రకు సంబంధించిన స్త్రీజనాపహరణా బలాత్కారాలూ, ప్రజలు స్వదేశాన్ని విడిచి కాందిశీకులు కావడాలూ కథలో ఇమడ్చబోయిన ప్రయత్నం మంచిదేకాని, ఆదృశ్యాలు ప్రేక్షకుల మనస్సుకు హత్తుకొనేటట్లు చేసినట్లయితే బాగుండేది.

ఆటవిక బాలికా రాకుమారుల బాల్యక్రీడలలో ప్రణయభావాలు చూపించడం ఎంతవరకూ సమంజసమో, నిర్మాతా, దర్శకుడూ, సెన్సారువారూ మరోసారి గమనించడం మంచిది.

చిత్రంలో ఫోటోగ్రఫీ, మేకప్ ప్రశంసనీయంగా వున్నాయి. మొత్తంమీద మహాలింగంపాటలలో కచేరీకత్తు లేకుండానూ, హాస్యఘట్టాలలో హీనాభిరుచి లేకుండానూ, అనవసరంగా కథను పెంచకుండానూ ఉన్నట్లయితే చిత్రం ఎంతో బాగుండేది.

---



సారథీ & కో భాస్కరరావుగార్ల 'అగ్నిపరీక్ష' లో శంకర్, తమ్మి పాత్రధారులు సి. యస్. ఆర్, శివరావు.



# బాలానందం

# మాలతీ మాధవులు

శ్రీ మహీధర నళినీమోహనరావు

పూర్వ కాలంలో— అంటే ఇంచుమించుగా రెండువేల ఏళ్ల క్రిందట "సౌవీర" దేశంలో "మాలతి", "మాధవుడు" అనే అన్నా చెల్లెలూ ఉండేవారు. వాళ్లిద్దరూ కలసి మెలిసి ఉండేవారు. ఒకళ్లని విడిచి ఒకళ్లు ఒక్క నిమిషమేనా ఉండేవారు కారు.

కొన్నాళ్లకి ఆ దేశంలో గొప్ప కరువు వచ్చింది. ప్రజలందరూ తిండి గింజలు లేక మలమలా మాడిపోతున్నారు. ప్రజలు గుంపులు గుంపులుగా ఇతర దేశాలకి వలస వెళ్లిపోతున్నారు. అప్పుడు మాలతీ మాధవులు కూడా ఆ దేశాన్ని విడిచి కాలినడకని బయలుదేరేరు.

ఒక దారీ తెన్నూ లేదు. కాళ్లు ఎటు తీసుకుపోతే అటు వెడుతున్నారు. కొంతదూరం వెళ్లేటప్పటికి వాళ్లొక అడవి చేరారు.

మధ్యాహ్నం అయింది. ఎండ చాలా తీక్ష్ణంగా ఉంది. మాధవుడికి చాలా దాహం వేసింది. ఎక్కడేనా నీళ్లున్నాయేమో నని ఒక చెట్టెక్కి చూసేడు. దగ్గరలోనే ఒక సెలయేరు కనిపించింది. మాధవుడు చెట్టు దిగి చెల్లెలితో ఏరుదగ్గిరికి వెళ్లేడు. ఒక రాతిమీదనుంచి ఇంకో రాతిమీదకి దూకుతూ, చిన్న చిన్న గులకరాళ్లన్ని దొర్లించుకుపోతూ, గలగల మని శబ్దంచేస్తూ కొండవాగు మహావేగంగా ప్రవహిస్తోంది. మాధవుడు గబగబా ఏరులో దిగి దోసిటితో నీళ్లు తీసుకున్నాడు. అప్పుడే మాలతికి ఏవో మాటలు వినిపించాయి.

"త్రాగకుము నాదు నీటిని
త్రాగదేని
మీదు కష్టాల కికమీద
మేర లేదు.
పెద్దపులి వయిపోదు వో
పిల్ల వాడ!
కాన నా మాట విని యెట
కైన పొమ్ము."

ఈ మాటలు వినేటప్పటికి తన అన్న పెద్దపులి అయిపోతా డని మాలతికి భయం వేసింది. వెంటనే మాధవుడితో "అన్నయ్యా! ఆ నీళ్లు తాగకు. పారపోసెయ్యి. తాగుతే పెద్దపులి వయిపోతావుట" అని చెప్పింది.

మాధవుడు ఆ మాటలకి ఆశ్చర్యపోయాడు. మంచినీళ్లు తాగడానికీ పెద్దపులి అయిపోవడానికీ సంబంధం ఏమిటి? పోనీ చెల్లెలు ఎందుకు చెప్పిందో నని, దోసిటిలో నీళ్లు పారపోసేసి, మళ్లీ ముందుకు బయలుదేరేడు.

ఇంకా కొంతదూరం వెళ్లేటప్పటికి ఇంకో కొండవాగు కనిపించింది. మాధవుడు నీళ్లు తాగడానికి అందులో దిగేడు. మాలతికి మళ్ళీ ఏవో మాటలు వినిపించాయి.

"త్రాగకుము నాదు నీటిని
త్రాగదేని
మీదు కష్టాల కికమీద
మేర లేదు.
తెల్లఏనుగు వగుదు వో
పిల్ల వాడ!
కాన నా మాట విని యెట
కైన పొమ్ము."

వెంటనే మాలతి తన అన్నతో "ఆఁ! ఆఁ! ఆ నీళ్లు తాగకు అన్నయ్యా! తాగితే తెల్లయేనుగు వయిపోతావుట. పారపోసెయ్యి" అని చెప్పింది. మాధవుడు విసుక్కుంటూ ఆ నీళ్లు పారపోసి, మళ్ళీ బయలుదేరేడు. ఇంకా కొంతదూరం వెళ్లేటప్పటికి ఇంకో కొండవాగు కనిపించింది. మాధవుడు గబగబా ఏరు దగ్గిరికి

పరుగెత్తేడు. మాలతికి ఈసారికూడా అవే మాటలు వినిపించాయి.

మాలతి మళ్ళీ ఆనీళ్లని తాగవద్దని అన్నని బ్రతిమాలింది. ఈమాటు మాధవుడికి దాహం ఎక్కువైపోయింది. నాలిక ఎండిపోతోంది. పీక ఆర్చుకు పోతోంది. నోటి వెంట మాట రావటం లేదు. వడగొట్టి పడిపోతాడా అన్నట్లున్నాడు. ఇంక దాహం ఆపుకోలేక గబగబా పొట్ట పట్టినన్నినీళ్లు తాగేసేడు.

ఇప్పుడు మాలతిపక్కని మాధవుడు లేడు. మంచి అందమైని లేడి ఒక టుంది. సన్నని కాళ్ళూ, పొడుగైన మెడ, చక్కని మచ్చలూ. మెడలో ధగధగా మెరిసిపోతున్న పెద్దమణి......! ఆ లేడి ఎంతముద్దు వస్తోందో!

కాని పాపం మాలతిమాత్రం తన అన్న అల్లాగ మారిపోయినందుకు ఎంతో విచారించింది. అంతకన్న ఏం చేస్తుంది? ఆ లేడిని తీసుకొని ఆ అడవిలోగుండా వెడుతోంది. అడవి అంతకంతకు దట్టమైపోతోంది. చెట్లూ తీగలూ ఒకదానికొకటి పెనవేసుకొని పందిరివేసిన ట్లున్నాయి. అక్కడక్కడ ఒక్కొక్క సూర్యకిరణాలు ఆకుల్ని తప్పించుకుని భూమిమీద పడి, నువ్వులూ బియ్యం కలిపి నేలమీద చల్లిన ట్లున్నాయి.

వాళ్లిద్దరూ అల్లా నడిచి వెళ్లగా వెళ్లగా ఒకచోట ఒక చక్కని భవనం కనపడింది. అంతా పాలగచ్చుతో చేయబడి ఇంద్రభవనం లాగ ఉంది. తలుపులన్నీ తీసే ఉన్నాయి. లోపల ఎవరేనా ఉన్నారేమో నని ఒక కిటికీలోనుంచి మాలతి తొంగిచూసింది. కాని లోపల ఎవ్వరూ లేరు. ఇద్దరూ లోపలికి వెళ్లేరు. లోపల ఎంతో చక్కగా ఉంది. లోపల రకరకాల వస్తువులు బోలెడున్నాయి.

ఇద్దరికీ చాలా ఆకలి వేస్తోంది. ఇల్లంతా వెతికారు. వంటఇంట్లోకి వెళ్లేరు. అక్కడ ఒక బంగారపు గిన్నె బోర్లించిఉంది. మాలతి ఆ స్వర్ణపాత్రను పైకి ఎత్తింది. బంగారపు కంచంలో పంచభక్ష్యపరమాన్నాలూ వడ్డించి ఉన్నాయి.

మాలతిఆశ్చర్యానికి మేర లేదు... మొదట్లో మాలతి చాలా సంతోషపడింది. కాని తన అన్న అల్లాంటివి తినడానికి వీలులేదుకదా అని విచారించింది. "మా॰ అన్నయ్యకు పనికివచ్చే ఆహారంకూడా ఉంటే బాగుండును" అనుకుంటూ మళ్లీ గిన్నె తీసింది. చక్కటి నవనవలాడే పట్టుకుచ్చులాంటి పచ్చిక అక్కడ ఉంది. అప్పుడు ఇద్దరూ సంతోషంగా ఆకలి తీర్చుకున్నారు.

ఇల్లాగే రోజూ ఆటలాడుకుంటూ

ఆకలి వేసినప్పుడు కమ్మటి వస్తువులు తింటూ ఇక్కడ హాయిగా కొన్నాళ్లు మాలతీమాధవులు గడిపేరు.

ఇల్లా ఉండగా కొన్నాళ్లకి వేట కుక్కలనీ, గుఱ్ఱాలనీ, వేటగాళ్లనీ భటులనీతీసుకొని సౌరాష్ట్రపు రాజకుమారుడు వేటకి ఆ అడవికి వచ్చాడు. సింహాలనీ, పెద్దపులులనీ, చిఱుతపులులనీ అనేకరకాల జంతువులని వేటాడేరు. అడవిఅంతా చిందరవందర అయిపోయింది. చచ్చిపోయే జంతువుల గోండ్రింపులతోటీ బలంతో విఱ్ఱవీగే జంతువుల బొబ్బలతోటీ, ఈ ధ్వనులు విని హడిలి పారిపోయే పక్షుల కూతలతోటీ, వేట కాళ్ల బాకాధ్వనుల తోటీ అడవిఅంతా కోలాహాలంగా ఉంది.

మాలతి ఈ ధ్వని విని హడిలిపోయింది. లేడి ఏమాత్రం భయపడలేదు. పైపెచ్చు ఆ వేట చూసి వస్తానంది. మాలతి మరీ భయపడిపోయింది. "అమ్మో! నువ్వు బయటికి వెడితే ఇంకేమేనా ఉందా? వాళ్లు బాణాలూ అవీ పుచ్చుకుని కొడతారు వెళ్లవద్దు" అంది మాలతి.

"పరవాలేదు. దుబ్బుల వెనకాల వాళ్లకి కనపడకుండా నిలుచుని చూస్తాను." అన్నాడు మాధవుడు. మాలతి వెళ్లవద్దని ఎంత బ్రతిమాలినా లేడి వినలేదు.

"అయితే నువ్వు తిరిగి ఇంటికి వచ్చి తలుపుమీద మూడుసార్లు తట్టు. అప్పుడు నువ్వే వచ్చావని తెలుసుకుని తలుపు తీస్తాను. ఏం? జాగ్రత్తగా వెళ్లిరా" అని చెప్పి లేడిని బయటికి పంపించింది మాలతి.

ఆ లేడి ఛంగుఛంగున గంతులు వేస్తూ, అక్కడికి వెళ్లి, ఒక దుబ్బు వెనకాల నిలుచుని వేట చూస్తోంది. రాజకుమారుడూ, ఒక వేటగాడూ ఆ లేడిని చూసేరు. దాని మెడలో ధగధగ మెరుస్తున్న మణిని చూసేటప్పటికి ఆ వేటగాడికి ఆశ పుట్టింది. ఒక గుఱ్ఱం ఎక్కి ఆ లేడిని పట్టుకుందామని అక్కడికి వచ్చేడు. ఆ లేడి ఒక్కనిమిషంలో మాయమైపోయింది. వేటకాడు నిరాశతో వెనక్కు వెళ్లిపోయాడు.

ఆమరునాడు కూడా మాధవుడు మాలతిని ఒప్పించి, వేట చూడడానికి వచ్చేడు. రాజూ, ఆవేటకాడూ మళ్లీ ఆ లేడిని చూశారు. మెడలో మణి తళుక్కుమంది. నిన్నటిలాగ దానిని తరుముకువెళ్లక అది ఎక్కడికి వెడుతుందో జాగ్రత్తగా చూసి రమ్మని ఆ వేటకాణ్ణి పంపించాడు రాజు.

ఆ లేడి ఇంద్రభవనానికి (మాలతీమాధవులు ఆ భవనానికి ఇంద్రభవనం అని పేరుపెట్టుకున్నారు) వెళ్లడం, తలుపుమీద మూడు సార్లు తట్టడం, మాలతి వచ్చి తలుపు తీయడం చూసి, ఆ వేటకాడు జరిగినదంతా చెప్పేడు.

మరునాడు లేడి మళ్లీ వచ్చింది. ఈ మాటు ఆ రాజు లేడికాలికి గురిచూసి ఒక్క బాణం వేసేడు. సరిగ్గా వెళ్లి ఆ బాణం లేడికాలికి గుచ్చుకుంది. ఇంక లేడిపరుగెత్తలేదు కదూ. అందుకని ఆ రాజుభటులు లేడిని ఇట్టే పట్టేసుకున్నారు. వెంటనే ఆ లేడిని తీసుకుని అందరూ ఇంద్రభవనానికి వెళ్లేరు. రాజు తలుపు మీద మూడుమార్లు తట్టేడు. తన అన్న వచ్చేడని మాలతి సంతోషంతో తలుపు తీసింది. ఎదురుగా రాజునీ, అతని పరివారాన్నీ చూసేటప్పటికి హడిలిపోయింది. తన అన్నకి ఏదో ప్రమాదం జరిగిందని తెలుసుకుంది. "మీ రెవరూ? మా అన్నయ్య ఏడీ?" అని ఆదురాగా అడిగింది మాలతి. "మీ అన్నయ్యా ఎవరూ?" అన్నాడు రాజు. "అదే...మాలేడి ఎక్కడ దాచేరూ?" అంది మాలతి. రాజు ఆ లేడిని ఇప్పించాడు.

రాజకుమారుడు తాను సౌరాష్ట్రపు రాజుకొడుకు ననీ, తన తండ్రిపేరు బలవర్ధను డనీ, తన పేరు వీరవర్ధను డనీ చెప్పి మాలతిని అక్కడ ఒంటరిగా ఎందు కుందో, ఆ లేడి మాలతికి అన్న ఏలాగ అయేడో చెప్పమని అడిగేడు. మాలతి తన వృత్తాంత మంతా చెప్పింది.

"నిన్ను మా సౌరాష్ట్రదేశానికి తీసుకువెడతాను వస్తావా?" అని అడిగేడు వీరవర్ధనుడు.

"మా అన్నయ్యను వదిలిపెట్టి రాను" అంది మాలతి.

"మీ అన్నయ్యను చాలా జాగ్రత్తగా తీసుకువెడదాం." అన్నాడు రాజు. మాలతి ఒప్పుకుంది.

ఆ స్వర్ణపాత్ర వీరవర్ధనుడికీ, అతని పరివారానికీ పంచభక్ష్యాపరమాన్నాలతో భోజనం పెట్టింది. స్వర్ణపాత్రనుకూడా తీసుకుని వాళ్లందరూ సౌరాష్ట్రం చేరుకున్నారు. ఆ రాజకుమారుడు మాలతిని తన రాణీగా చేసుకున్నాడు.

ఆ స్వర్ణపాత్రకి ఏం వచ్చిందో



కాని సౌరాష్ట్రానికి వచ్చాక ఇది వరకులాగ ఏవస్తువులూ ఇవ్వటం లేద. అల్లాగ ఎంచేత అయిందో ఎవ్వరికీ తెలియలేదు

ఒక రోజున మాలతి తన లేడికి చక్కని పచ్చిక పెడుతోంది ఉన్న ట్టుండి ఆ లేడి హఠాత్తుగా మామూలు మాధవుడుగా మారిపోయింది మాలతి ఆశ్చర్యపోయింది తన అన్నకు మామూలురూపు వచ్చినందుకు ఎంతో సంతోషించింది ఈ లేడి మనిషయిపోయిందన్న వార్త నిమిషంలో దేశం అంతా తెలిసిపోయింది

అంతకుముందే బలవర్ధనుడి మంత్రి చనిపోయాడు వెంటనే తెలివైన మంత్రి కావలసివచ్చాడు అందుకు రాజు ఒక ఉపాయం ఆలోచించాడు

ఇంద్రభవనంనుంచి తీసుకువచ్చిన స్వర్ణపాత్ర ఇదివరకులాగ వస్తువుల నెందు కివ్వటం లేదో, ఊరులో వచ్చి, సరియైన జవాబులు చెప్పలేక బుర్ర గోక్కుని వెళ్లిపోతున్నారు

అప్పుడు మాధవుడు రాజుదగ్గరకు వచ్చి ఆ జవాబులు తాను చెప్తానన్నాడు రాజు ఒప్పుకున్నాడు మాధవుడు ఇల్లా చెప్పేడు

"మాలతీమాధవులు నట్టడవిలో ఉన్నప్పుడు ఈ స్వర్ణపాత్రే కనక లేకపోతే తిండిలేక మలమలా మాడిపోయిఉండేవారు అక్కడ ఆ లేడి మాధవుడుగా ఎందుకు మారిపోయిందో సరిగ్గా చెప్పిన వాళ్లకి మంత్రిపదవి నిస్తానని తన దేశం అంతటా చాటించాడు

అనేకమంది జవాబు చెప్పి మంత్రి పదవి పొందాలని ఆశతో పోయి ఈ పాత్రఅవసరం చాలా ఉంది కాని ఇక్కడ ఆ స్వర్ణపాత్ర ఉన్నా లేకపోయినా తిండికి లోటు లేదు అంటే ఆ పాత్ర ఉపయోగంలేదన్నమాట అవసరం ఉంటే కాని ఆ పాత్ర వస్తువుల నియ్యదు అందుకనే ఆ పాత్ర ఇదివరకులాగ వస్తువుల నియ్యడం లేదు నేనుచెప్పినది నిజం అవునో కాదో తెలుసుకోవాలంటే ఈ స్వర్ణపాత్రని మళ్లీ ఇంద్ర భవనంలోకి తీసుకువెళ్లిచూడండి."

వెంటనే రాజు వీరవర్ధనుడికి ఆ స్వర్ణపాత్ర నిచ్చి, కొంత సైన్యాన్ని సహాయంగా పంపి, ఇంద్రభవనానికి పంపించాడు పాత్రని పరీక్షించడానికి

మాధవుడు రెండో ప్రశ్నకు జబాబు ఇల్లా చెప్పేడు. "ఆ లేడి పచ్చిక మేస్తున్నప్పుడు ఆ గడ్డిలో 'హరిణమానవమూలము' అనే తమాషాఅయిన వేరు ఒకటి ఉంది. ఏ లేడైనా సరే ఆ వేరుని కొరుకుతే వెంటనే మనిషిగా మారిపోతుంది అల్లాగే ఆ లేడి ఆ వేరుని కొరకగానే మాధవుడుగా మారిపోయింది కావలిస్తే ఆ గడ్డిని వెతికి చూడండి హరిణమానవమూలము ఉంటుంది

వెంటనే రాజు గడ్డిని వెతికించాడు అందులో మాధవుడు చెప్పినట్లుగానే ఆ వేరు ఉంది

ఇంద్రభవనంలోకి పంపించిన భటులు తిరిగివచ్చి, ఆ భవనంలోకి వెళ్లగానే ఆస్వర్ణపాత్ర కావలసినన్ని వస్తువుల నిచ్చిందని చెప్పేరు

బలవర్ధనుడు మాధవుని ప్రజ్ఞకి ఆశ్చర్యపోయాడు తను చేసిన ప్రతిజ్ఞ ప్రకారం మాధవుని ప్రధాన మంత్రిగా చేసుకున్నాడు.

---

# నిజం నిలకడమీద తెలుస్తుంది

మూలం :
టాల్‌స్టాయ్

అనువాదం :
"శ్రీకృష్ణ"

పూర్వం వ్లాడిమీర్ అనే పట్నంలో అసినోవ్ అనే వర్తకుడు ఉండే వాడు. అతడు చాలా ధనవంతుడు, రూపసి, గాయకుడు. చిన్నతనంలో తన ఐశ్వర్యాన్ని చాలావరకు త్రాగుడుక్రింద దుర్వినియోగం చేసినా, పెండ్లయిన తరువాత పండగరోజుల్లో తప్ప, త్రాగటం మానేశాడు.

ఒక వేసంగిలో ఓ రోజున సంతకు వెళ్లి తన సరకును అమ్మేదా మనుకొన్నాడు అసినోవ్. ఈ సంగతి తన భార్యకు చెప్పగా, "నా కొక చెడు కల వచ్చింది. అంచేత ఈ రోజున మీరు సంతకు వెళ్లవద్దు." అన్న దామె.

"నేను సంతకు వెళ్తే సురాపానం చేస్తానేమో ననుకుంటున్నావ్. మరేం ఫర్వాలేదు. నేనలా సంతలో త్రాగను"

"నాకు ఏదో చెప్పరాని భయం వేస్తోందండీ. ఏమిటో ఆ పాడుకల—మీరు పట్నంనుంచి రాగానే మీ టోపీ తీసేసరికి మీ అందమైన జుట్టు తెల్లగా పండి పోయిఉంది—"

"ఇంతేనా. అదైతే మంచిశకున మన్నమాట. చూడు! ఈ సరుకంతా అమ్మి నీకు క్రొత్తరకం నగలు తేకపోతే నా మాట నమ్మకు," అని అంటూ అసినోవ్ గుర్రపుబండిపై సంతకు బయలుదేరాడు.

కొంతదూరం ప్రయాణం చేసేసరికి, అసినోవ్‌కి తెలిసిన వర్తకు డొకడు కలిసేడు. ఇద్దరూ ఆ రాత్రికి ఒకే సత్రంలో బసచేశారు. అసినోవ్ తెల్లవారుజామునే లేచి. "చల్లగా ఉన్నప్పుడే ప్రయాణం సాగించాలి" అనుకుని సత్రంయజమానికి బాడుగ ఇచ్చేసి, మళ్లీ బయల్దేరాడు.

సుమారు 20 మైళ్లు ప్రయాణం చేశాడు. ఇంకా చిన్నచీకటి ఉంది. గుర్రానికి దానాకోసం ఓ చిన్నసత్రందగ్గర ఆగేడు. అక్కడే కొంచెం 'టీ' తీసుకొని చల్ల గాలిలో సంతోషంగా పాడుకొంటున్నాడు. ఈ సమయంలో ఒక పోలీస్ వేన్ వచ్చి అక్కడ ఆగింది. అందులోంచి ఒకఇనస్పెక్టరు, ఇద్దరుపోలీసులు దిగేరు. ఇనస్పెక్టరు తిన్నగా అసినోవ్ దగ్గర కొచ్చి, "నీ వెవరు? ఎక్కడనుంచి వస్తున్నావు? రాత్రి ఎక్కడ ఉన్నావు? ఒంటరిగానే ఆ సత్రంలో బసచేశావా? లేక ఇంకొక వర్తకునితో ఉన్నావా? ప్రొద్దున్న అతన్ని చూశావా? ఇంత వేకువనే ఎందుకా సత్రం నుంచి వచ్చావు?" అని ప్రశ్నలవర్షం కురిపించేసరికి, అసినోవ్ ఆశ్చర్యపోయాడు. ఇనస్పెక్టర్ని శాంతంగా విషయ మేమిటని అడిగేడు. రాత్రి తనతో ఉన్న వర్తకుని అతనే హత్యచేశాడని ఇనస్పెక్టరు చెప్పేసరికి అతనికి (అసినోవ్‌కి) భయాశ్చర్యాలు పెనగొన్నాయి. అసినోవ్ సామాన్లు తనిఖీ చేయించగా రక్తపు మరక లున్న ఒకబాకు సంచిలో కనిపించింది. ఆ కత్తి తనది కాదని అసినోవ్ ఎంతచెప్పినా వినక అతడిని హంతకునిగా భావించి, సరుకు స్వాధీనపరుచుకొని, అరెస్టు చేశాడు ఇనస్పెక్టరు. కేసువిచారణ జరిగింది – చిన్నతనంలో అసినోవ్ ప్రవర్తన మంచిది కాదనీ ఇప్పుడొక వర్తకుని చంపి, వాని ఆస్తి దోచుకున్నాడనీ—నేరం మోపి, జీవితాంతం సైబీరియాలో మిగతాహంతకులు, నేరస్థులతో గడపాలని శిక్ష విధించారతనికి.



ఈ భోగట్టా తెలిసి, అసినోవ్ భార్య తన భర్త ఏ పాపం ఎరుగడని, శిక్షతప్పించమని అధికార్లకు మహాజర్లు పంపింది. కాని లాభం లేకపోయింది. అతికష్టంపై అనుమతి తీసుకొని భర్తవద్ద కొచ్చి ఈ సంగతి చెప్పి, "ఆ రోజున-నాకు చెడ్డ కల వచ్చింది- సంతకు వెళ్లవద్దన్నాను, జ్ఞాపకం ఉందా? ఆవేళ వెళ్లకపోయినట్లయితే ఈ పాపం చుట్టుకొనేది కాదు! మీ కష్టసుఖాల్లో నాకు భాగంఉంది. అంచేత నాతోనైనా నిజంచెప్పండి. ఆ వర్తకుని చంపింది మీరేనా?" అని ప్రశ్నించింది. దీనితో తన కున్నరవంత ఆశనూ వదలుకున్నా డసినోవ్. తన భార్య కూడా తన్ను అనుమానిస్తుంటే ఇక న్యాయం ఎలా జరుగుతుంది? భార్య పిల్లలు వెళ్లిపోయినతరవాతఒకసారి జీవితాన్నంతా తల్చుకున్నాడు. తన భార్యే తన్ని నమ్మలేదన్న సంగతి జ్ఞాపకం రాగానే, "నిజం ఎప్పటికైనా బయల్పడదా, ఇందులోని యథార్థం అసర్వేశ్వరునికే తెలుసు. ఇంక వానినే నమ్మి ప్రార్థిస్తాను." అని సమాధానపడ్డాడు.

26 సంవత్సరా లైంది అసినోవ్ సైబీ

రియా కొచ్చి ఆతని జుత్తు తెల్లగా పండి పోయింది తెల్లటి పెద్దగడ్డం తయారైంది. సంతోషహీనంగా, కళావిహీనంగా, మిత భాషిగా, మనోవ్యాధితో, దైవప్రార్థనలోనే తనకాలం వెళ్ళబుచ్చుతున్నాడు. జోళ్లు కుట్టడం నేర్చుకొన్నాడు అసినోవ్.

జైలుఅధికార్లు అసినోవ్ సాత్త్వికప్రవర్తన చూసి, దయతో ఆదరించేవారు. మిగిలిన నేరస్థులు ఆతనిని 'మహాత్ముడ'ని గౌరవించి, తమలో వివాదాలను పరిష్కరించమనేవారు. కాని అసినోవ్ ఇవన్నీ లక్ష్యం చేయలేదు. అతనికి ఒక్కటే చింత. వ్లాడిమార్‌లో తనభార్య, పిల్లలు ఎలాఉన్నారో, అసలు బ్రతికిఉన్నారో? లేదో? అనే.

ఇలా ఉండగా, మరొకముఠా నేరస్థులు సైబీరియా వచ్చేరు. పాతనేరస్థులు, క్రొత్త వారిని పరిచయం చేసుకుంటూ, వారు ఎందుకు శిక్షింపబడ్డారో భోగట్టా చేసే వారు. అసినోవ్ మాత్రం ఈ ధ్యానం ఏమీ లేకుండా, అలా ఆలోచిస్తూ కూర్చునే వాడు. ఒకనాడు క్రొత్తనేరస్థుడొకడు దృఢశరీరం కల 60 సంవత్సరాల వ్యక్తి, తనకథ చెప్పటం ప్రారంభించేడు:

"నేను వ్లాడిమార్ కాపురస్థుణ్ణి. నాపేరు మకీర్. ఒకరోజున ఇంటికి త్వరగా పోవలసి వచ్చి, నాకు తెలిసిన బండివాని గుర్రం తీసుకొని బయల్దేరేను. వాని గుర్రం తిరిగి ఇచ్చేద్దామనుకున్నాను. కాని, నేను కొంతదూరం వెళ్ళేసరికి నేను గుర్రమును దొంగిలించేనని నన్ను అరెస్టు చేశారు. నేను ఆ గుర్రాన్ని ఎక్కణ్ణుంచి తెచ్చానో వారికి తెలిసే తెలియదు. నేను చెప్పేదేమీ వినకుండా, ఈ స్వల్పనేరానికి సైబీరియాకు పొమ్మని శిక్ష విధించేరు. అసలు నిజం చెప్పవలసివస్తే, కొన్నిసంవత్సరాల క్రితం నేను క్షమించరాని నేరం చేశాను. అప్పుడు ఈ పోలీసులు నన్ను పట్టుకోలేక పోయారు. లేకపోతే నేను అనాడే ఇక్కడికి వచ్చేవాణ్ణి."

మకీర్ వ్లాడిమార్‌నుంచి వచ్చేడని తెలియగానే, "మకీర్! మీ వూళ్లో అసినోవ్ కుటుంబంగురించి ఏమైనా తెలుసా! వారు ఇంకా జీవించేవున్నారా?" అని అసినోవ్ ప్రశ్నించాడు. "కొంచెం తెలుసు. వారు ధనవంతులే, కాని వారి తండ్రిమాత్రం సైబీరియా పంపబడ్డాడు. పాపం. మనలాగే ఏదో తప్పుచేసి ఉంటాడు, కాని కేం తే. నీ వెందుకు ఇక్కడి కొచ్చావు?" అన్నాడు మకీర్.

"ఏదో, నా పాపంకొద్దీ ఇక్కడ 26 సంవత్సరాలనుంచీ ఉన్నాను. ఈ శిక్ష నాకు తగినదే. ఇంతకన్న మరి చెప్పలేక పోయా డసినోవ్. అక్కడనుంచి వెళ్ళిపోయాడు. పాతఖైదీలు మకీర్‌కి, అసినోవ్ వృత్తాంతం అంతా సమగ్రంగా చెప్పేరు. ఈ వృత్తాంతం అంతా విన్న మకీర్ అసినోవ్‌ని పిలిచి "ఏమిటే! నువ్వేనా అసినోవ్. ఎంత ముసలాడివై పోయావ్!" అన్నాడు. మకీర్ ఇదివరకు అసినోవ్‌ని ఎరిగిఉంటా డనుకొన్నారు మిగతాఖైదీలు. మకీరే వర్తకుని సత్రంలో చంపి కత్తినితన సంచీలో పెట్టా డనుకొన్నాడు, అసినోవ్.

ఆ రాత్రల్లా అతనికి నిద్ర పట్టనే లేదు. తన వెనుకటిజీవితంఅంతా కళ్లకు కట్టింది. సంతకు వెడుతున్నప్పుడు తన భార్య పోవద్దని హెచ్చరించటం—తన యిద్దరుచిన్న పిల్లలు—ఆనందమయమైన తన జీవితం—ఆ రెస్టయేముందు సత్రంవద్ద కూర్చుని ఖులాసాగా పాడుకోవటం—26 సంవత్సరాల ఖైదీజీవితం—వృద్ధాప్యంలో తన ప్రస్తుతజీవితం-జ్ఞాపకం వచ్చే సరికి తన ప్రాణాలు పోయినాసరే మకీర్‌పై పగ సాధించాలనుకొన్నాడు. కాని, వెంటనే "అయిందేదో" అయిపోయింది. ఇప్పుడు కసితీర్చుకోటం తప్పు" అనుకున్నాడు. పదిహేను దినాలవరకు మకీరున్నవైపే వెళ్ళటం మానేశాడు.

ఒకనాటిరాత్రి అసినోవ్ తన గదిలో పచారు చేస్తుండగా ఒక చిన్నసొరంగం గుండా వచ్చాడు మకీర్. "ఈ సొరంగం లోని మట్టిని నా బూట్సులో వేసుకొని బయటికి పనికి వెళ్లినప్పుడు పారపోస్తూ, ఈ కన్నం తయారుచేసాను. అసినోవ్, నీవు ఇందులోనుంచి తప్పించుకుని పారిపో. ఈ సంగతి పైకి చెప్పావా, ఇప్పుడే నిన్ను చంపేస్తా. ఏమంటావ్?" అన్నాడు మకీర్.

"నేను తప్పించుకుపోను. నువ్వు ఇది వరకే నా జీవితాన్ని నాశనం చేశావు. నా పరువుప్రతిష్ఠ మంటకలిపావు చాలదూ? బ్రతికిచెడిన నన్ను ఇంకా చంపే దేముంది. ఇంక, నీమీద అధికార్లతో ఫిర్యాదుచేయడం సంగతా, నాకు భగవానుడు ఎలా చేయమని ఆజ్ఞిస్తే అల్లా చే ." ఈ వాక్యాలు మకీర్ గుండెల్లోకి దూసుకు

పోయేయి. ఇంక అక్కడ నిలువలేక తన గది చేరుకున్నాడు.

కొన్నాళ్లకు, జైల్లో సారంగం అధికారులకంట పడింది. ఆ పని ఎవరు చేశారో మట్టుకు తెలుసుకోలేకపోయేరు. అధికారి అసినోవ్‌తో, "నువ్వు నిజం చెప్తావని నాకు తెలుసు. దేవునియెదుట నిజం చెప్పు. ఎవరు ఆ సారంగం త్రవ్వేరు?" అన్నాడు. కొంతసేపు ఆలోచించి, అసినోవ్, "ఈ విషయంలో నేను మీరు అడిగిన ప్రశ్నకు జవాబు ఈయలేను. నేను మీ చేతుల్లో ఉన్నాను. ఏం చేసినా సరే." అన్నాడు. అధికారి ఇంకా ప్రయత్నించాడు, కాని ఫలితం శూన్యం.

ఆ రాత్రి అసినోవ్ పడుకొన్నే సమయానికి, ఫకీర్ అక్కడికి వచ్చాడు. వానిని చూసి, "ఇంకా ఎందుకొచ్చావు? నీకేం కావాలి? కాపలావాన్ని పిలవాలా, వెళ్లిపోతావా?" అని ఉగ్రావతారం ఎత్తేడు అసినోవ్. "ఆ వర్తకుని నేనే చంపాను అసినోవ్. విను. నిన్ను కూడా చంపాలనుకొన్నాను. ఇంతలో అవతలగదిలోనుంచి అలికిడి వినవచ్చింది. అంచేత ఆ కత్తి నీ సంచిలో దాచేసి, కిటికీగుండా పారిపోయాను."

ఇది విన్న తరువాత ఇతికర్తవ్యతావి మూఢుడైనాడు అసినోవ్. ఫకీర్ వాని కాళ్లపై బడి బ్రతిమాలాడు.

"అసినోవ్! భగవంతుని ప్రేమకోసం నన్ను క్షమించు. ఆ వర్తకుని చంపినది నేనే నని అధికార్ల ఎదుట ఒప్పుకుంటా. నువ్వు మీ యింటికి పో"

"మాట లనటం సులువే ఫకీర్. నువ్వు చేసిన తప్పుకు నేను 28ఏళ్లు బాధపడ్డానే. ఇప్పుడు నే నెక్కడికి పోగలను? నా భార్య చనిపోయింది. పిల్లలు నన్ను మరచిపోయారు. ఈ ప్రపంచంలో నేను వెళ్లవలసిన చోటు లేదు."

ఫకీర్ అసినోవ్ పాదాలు విడువలేదు. తల నేలకు కొట్టుకుంటూ, "క్షమించు అసినోవ్. నేను పోలీసులచే తిన్న కొరడా దెబ్బల బాధకన్నా నీ వానాడు ఆడిన మాటలు, ఇప్పుడు నిన్ను చూస్తుంటే బాధ భరింపరానిదిగా ఉంది. కాని నామీద నీకు దయ ఉంది. నన్ను పోలీసులకు ఒప్పజెప్పలేదు. భగవంతునికోసమైనా నన్ను క్షమించు. పాపాత్ముణ్ణి రక్షించు, అసినోవ్" ఫకీర్ పశ్చాత్తపబాష్పాలతో అసినోవ్ పాదా లభిషేకింపబడ్డాయి. అసినోవ్‌కి దుఃఖం ఆగింది. కాదు.

"భగవంతుడు నిన్ను క్షమిస్తాడు ఫకీర్. నేను నీకన్నా పాపాత్ముణ్ణేమో". అంటూ అసినోవ్ అశ్రువులు తుడుచుకున్నాడు."

ఇప్పుడు అసినోవ్‌కి ఇంటికి పోదామనే ఉద్దేశ్యమే లేదు. ఇప్పు డతనిహృదయం తేలికైంది. ఇంకా, చీకటి తో ఉండా జైల్లో భగవద్ధ్యానం చేస్తూ కాలం వెళ్లబుచ్చుతున్నాడు. తనకే, ఈ లోకానికీ ఎప్పుడు సంబంధం తెగిపోతుందా అని ఎదురుచూస్తున్నాడు.

అసినోవ్ మాటలు వినకుండా ఫకీర్ అధికార్ల ఎదుట తనే హంతకుడ్నని, అసినోవ్ నిర్దోషి యని ఒప్పుకున్నాడు— కాని ఏం ప్రయోజనం;—అసినోవ్‌కి విడుదలఆర్డరు వచ్చేసరికి, ఆ మహాపురుషుడు సత్యాన్వేషణ చేయలేని ఈ లోకంనుంచే విడుదలయ్యాడు.

"నిజం నిలకడమీద తేలిం?" దనుకుంటూ మిగిలిన ఖైదీలు అసినోవ్ పవిత్రస్మృతికి పుష్పాంజలులు సమర్పించారు.



విజయవాడలోని దుర్గాగ్రహారం చౌకులో యువజనసంఘం ఆధ్వర్యాన జరిగిన స్వాతంత్ర్యోత్సవం. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు పతాకోత్సవం చేశారు.

బాలానందం :

# భామినీసామ్రాజ్యము

సుమారు ఆరువందల యేండ్ల క్రిందట కాశీనగరమున దైవజ్ఞ శేఖరుడైన గంగూ యనెడి బ్రాహ్మణు డొకడు నివసించుచుండెను. అతడు మిగుల పేదవాడు. అందుచే నాతడు ఢిల్లీనగరమున కేగి పాదుషాయొద్ద తన పాండిత్యమును ప్రదర్శించి, మంచి పలుకుబడి సంపాదించెను.

గంగూయొద్ద హాసన్ అనెడి మహమ్మదీయ సేవకు డొకడుండెను. అతడు మిగుల చురుకైనవాడు. బుద్ధిమంతుడు. ఒకనాడు గంగూయొక్క పొలమును దున్నుచుండగా నొక బంగారపు బిందె కన్పడెను. హాసన్ దానిని గొనివచ్చి తన యజమాని కొప్పగించెను.

హాసన్‌సత్ప్రవర్తనకు గంగూ మిగుల సంతోషించి, ఆతని యభివృద్ధిని గోరుచుండెను. గంగూ, హాసన్‌హస్త మొకనాడు పరిశీలించి, రాజు కాదగిన చిహ్నముల గుర్తించి ఆతని కా సంగతి నెరిగించెను. అతడు మిగుల సంతసించెను. గంగూ హాసన్ రాజైనప్పుడు తనను మరిచిపోవల దని కోరెను. మరువ నని హాసన్ ప్రమాణ మొనరించెను.

ఆకాలమున ఢిల్లీని రాజధానిగ జేసికొని హిందూస్థానమును మహమ్మద్ బిన్‌తుగ్లక్ పరిపాలించుచుండెను. గంగూ హాసన్‌ను తుగ్లక్ యొద్దకు గొనిపోయి, ఆతని సద్గుణముల వర్ణించి, యాతని కేదేని యుద్యోగ మిప్పింపవేడెను. హాసన్‌కు సైన్యాధిపత్యము లభించెను.

అదిమొదలాతడనేక యుద్ధముల నొనరించి విజయము పొందెను. అతడు దక్కను జయింపగోరి కల్బరగి పట్టణమును స్వాధీన మొనర్చుకొనెను. పోనుపోను తుగ్లక్ విపరీతచర్యలు భరింరాని వగుటచే, యెక్కడి సామంతు లక్కడ స్వాతంత్ర్యమును ప్రకటించుచుండిరి. అదే సమయమున హాసన్ గూడా స్వతంత్రించి రాజాయెను.

## ఎస్. మోహనరావు

హాసన్ గంగూను జ్ఞప్తియందుంచుకొని తన పేరునే "హాసన్ గంగూ" యని మార్చుకొనెను.

తనకు పట్టిన సిరియంతయు గంగూదయవలననే యని యతని భావము. అందుచే గంగూను తన ఖజానాకు అధికారిగా నియమించెను.

గంగూకు, సాముద్రికము, జ్యోతిషము, శకునశాస్త్రములు చక్కగా తెలియును. భూత, భవిష్యద్వర్తమానముల నాతడు చెప్పగలడు.

అందుచే హాసన్‌కు గంగూ యెడల గల భక్తి మితిమీఱిపోయెను. తన రాజ్యము, తన వంశము, సర్వమును గంగూయొక్క దయాధీనము లని తలంచుచుండెను.

కాని, హాసన్ రాజైనప్పటి నుండి, హిందువులను బాధించుచుండెను. ఇది గంగూ కిష్టము లేదు. గంగూ ఒక యాలోచన చేసెను. తానును, సుల్తాన్‌హాసనును, కొన్ని నిబంధనలు జేసికొనునట్లును, దీని వలన సుల్తానుగాని, వారి వంశస్థులు కాని, హిందువులను చంపకుండునట్లును, గంగూ వంశస్థులు వంశపరంపరగా సుల్తానునకు మిత్రులుగ నుండునట్లును నిర్ణయ మొనరించుకొని, సుల్తాను నొప్పించెను. సుల్తాను వంశమువారు యీ నిబంధనల నతిక్రమించనంతవరకు, గంగూ బ్రాహ్మణుని యాత్మ ఆ సుల్తానును రక్షించుచుండు నని ఆనాడు తలచుచుండిరి. సులతాను నాటినుండియు హిందువుల హింస మానెను.

అప్పటినుండి యీ వంశము వారు బ్రాహ్మణసులతాను లయిరి. బ్రాహ్మణశబ్దము బహ్మనీగా మారి వారు బహ్మనీసులతాను లైరి. వారి సామ్రాజ్యమునకు బహ్మనీ (భామినీ) సామ్రాజ్య మని పేరు.

---

# "కాంతాకనకాలు"

(10-వ పేజీ తరువాయి)

లంతా బామ్మగారమ్మాయిని శూర్పణఖని పిలిచేవారు.

ధర్మారావు నవ్వుతూ 'శూర్పణఖ కులాసాగా వుందా? ఎక్కడిప్పుడు. దాని మొగుడికి వుద్యోగం? శని నసలా చాయలకు రావటమే మానేశాగా.' అని గుక్క తిప్పుకోకుండా అన్నాడు. బామ్మగారు చెప్పింది. 'చక్రధరరావు కిచ్చాం మా అమ్మాయిని. ఈ వూరే. దాని మొగుడు కమర్షియల్ టాక్సుఆఫీసులో...'

ధర్మారావు 'చక్రధరరావా- వాడేనా- వాడూ నా క్లాసుమేటు. "అరె గుక్కిణిని యిండాకే నేను చూచానే- వాడే నాకు చంటిపిల్లను తెచ్చి చూపించాడు. అయితే మీ అమ్మాయికి సుస్తీగా వుందటగా. మద్రాసు తీసుకెళ్తున్నానన్నాడు. వెళ్లిపోయారే-'

ధర్మారావు వాక్యాలను కలగాపులగంగా అస్పష్టంగా వుచ్చరించాడు.

బామ్మగారు తెల్లబోయింది.

'మద్రాసు వెళ్లాడా. ఇట్లా వెళ్తున్నానని జాబేనా! వ్రాశాడుగాడు. చూశాగా... విన్నావుటే కనకం. మీ బావ మద్రాసు తీసుగెళ్లాట్ట' అంది, గుమ్మంలో నుంచుని ధర్మారావుకుమారుడ్ని చంక నిరికించుకున్న కనకంకి వినిపించేట్టు.

'అదేమిటే అమ్మా! ఉత్తరంముక్కైనా వ్రాశాడు గాడు. మన మింత అవస్థా పడి యిల్లు దొరక్క నానాయాతనలూ పడుతూ యీ వూరు చేరుకుంటే-'

ధర్మారావు కనకాన్ని గుర్తుపట్టి 'నువ్వెంతదాని వయ్యావే! అప్పుడింత దానివి.' అంటూ నవ్వాడు.

చివరకు రాత్రి కిక్కడ గడిపి ఉదయాన్న బయల్దేరి రంగాపురమే వెళ్లిపోవటానికి నిర్ణయించుకున్నారు. కస్తూరి చకచక లాడింది వంటచేయటంలో. కాంతారావు బామ్మగారు కనకం ధర్మారావు-అంతా ఒక్కసారే ఏకపంక్తిని భోజనాలు పూర్తిచేసి దొడ్లో ప్రక్కలు వేసుకుని కబుర్లు సాగించారు. ఈలోగా కస్తూరి భోజనం పూర్తిచేసుకుని, దొడ్లోకి వచ్చి భర్త కెదురుగ్గా కనకంప్రక్కన కూర్చుంది.

కాంతారావు మూల నులకమంచం పరుచుకుని మేనత్తశేషమ్మగారికి కబుర్లు చెబుతున్నాడు. ధర్మారావు ఆకాశాని కేసి చూసి లేచి నిలబడ్డాడు. మళ్లీ యథాతథంగా కాళ్లు చెప్పులజోళ్లకు, చేయి ఉత్తరీయం కోసం వెతుకులాడాయి.

కస్తూరి వెనక్కాలే మెల్లగా నడుస్తూ- 'రోజూ సాగిస్తే ఎల్లాగ చెప్పండి. ఇంట్లో వుండరాయె. ఈ క్రొత్తలవాటేమీ బాగు లేదు సుమండీ!' అంది దిగులుతో. 'ఏమిటే వెర్రిబాగులదానా? నువ్వే మనుకొంటున్నావు?' కస్తూరి గునుస్తూ 'మీ రిల్లా రాత్రిళ్లు తిరగటం బాగులేదండీ-' అంది. ధర్మారావు బిగ్గరగా నవ్వి - 'పిచ్చీ! పోయి పండుకో...' అని చీకట్లో గట్టిగా బుగ్గను సాగదీసి వెన్నుమీద చరిచి వెన్నెట్లోకి అంతర్హితు డయ్యాడు.

ఆడవాళ్లకు చాలా త్వరితంగా 'సిగరెట్లు కాఫీ కిల్లీ సోడా' యిత్యాదిబంధనాలు లేకుండా కేవలం వాగ్దేవి స్త్రీకావటం వలన వాగుడుతో గట్టి పరిచయం సులువుగా నిమిషాలమీద ఏర్పడుతుంది క్రొత్త మనుష్యులతో.

కస్తూరికీ కనకానికీ కొద్దిగంటల మైత్రిలో- 'అక్కా, బావగార్ని ఎక్కడికమ్మా పంపించేశా' వనేటంత చను వేర్పడింది.

కస్తూరి నవ్వి వూరుకుంది. కాంతారావూ అదే ప్రశ్న వేశాడు. 'పిన్నీ బాబయ్య సినీమాకా వెళ్లింది?' అని. 'ఏమో నాయనా.' అనేసి ప్రక్కబట్టలు తెచ్చి దొడ్లో మంచాలమీద పరుస్తూ - 'కనకమ్మా నువ్వెక్కడ పడుకుంటావమ్మా' అంది యథాలాపంగా.

కనకం క్రొత్తచనువుతో 'బావగారొచ్చేదాకా నీ దగ్గిరే పరుంటానమ్మా- నా కసలు భయం ఎక్కువ.' అనేసింది. ఇద్దరూ పగలబడి నవ్వారు. నులకమంచం మీద దొర్లుతూన్న కాంతారావు చిట్టి తమ్ముడ్ని జోకొడుతూ కనకంచమత్కారానిక నవ్వకుండా ఆనందిస్తున్నాడు లోలోపల.

కస్తూరి బొగడచెట్టుక్రింద చాప పరుచుకుని పైకి నక్షత్రాలకేసి చూసి ఆలోచిస్తూ ధర్మారావునిగూర్చి ఎక్కడకు వెళ్లివుంటాడా అని ఊహించ సాగింది. వంటయింటి గడపమీద మంచినీళ్ల మరచెంబు వెన్నెట్లో ధగధగాయమానంగా మెరుస్తోంది. అక్కడేమరో చాప పరుచుకుని బామ్మగారు గుర్రుపెట్టి నిద్రపోతోంది. ఇవతల మడతమంచంమీద భర్తకోసం వేసిన ప్రక్కమీది తెల్లటి దుప్పటే తెల్లత్రాచుకుమల్లె బుసలు కొడ్తోంది. ప్రక్కవారి యింట్లో ఎరువు తెచ్చిన పట్టెమంచంమీద కనకం మేనువ్రాల్చింది. పొగడచెట్టుమీద నుంచి రాలుతూన్న పువ్వుల చప్పుడు వల్లనో మనస్సులోని యోచనాతరంగాల తాకిడివల్లనో కస్తూరికి నిద్ర పట్టలేదు. అదిగాక క్రింద రాళ్లు గుచ్చుకోవటంవలన, చంటిపిల్లతల్లికి సుఖనిద్ర పట్టే అవకాశం మృగ్య మనిపించింది. ప్రయాణబడలికవలన కాంతారావుకూడా నిద్రపోయి వున్నాడు. కస్తూరిమాత్రం దొర్లుతూ యిటూఅటూ గంటసేపు గడిపేసింది. ప్రక్కలోని చంటివాడూ మేలుకొని ఏడుపు సాగించాడు. కాంతారావు లేచి 'పిన్నీపిన్నీ' అని పిలిచాడు. కస్తూరి 'ఏం కావాలి నాయనా!' అంది.

సరిగ్గా అప్పుడే చల్లగాలి ఒక కెరటంలా వచ్చి కొద్దిగా గిజగిజలాడించింది. కాంతారావు మంచంమీద లేచి కూర్చొని 'పిన్నీ- నువ్వు నేలమీద పడుకున్నావా? అని నేల కేసి చూశాడు. గతుకులు గతుకులుగా వుంది. 'ఊఁ' అని కస్తూరి మూలిగింది, పిల్లవాడ్ని జోకొడ్తూ.

నువ్వీ మంచంమీద పడుకో పిన్నీ. పిల్లాడు నేలమీద రాళ్లు గుచ్చుకుంటే పడుకోలేడు. నే నా చాపమీద పడుకుంటాలే- అన్నాడు.

'వొద్దులే-నాయనా. నువ్వు ప్రయాణం చేసొచ్చావు.' అంది.

"అదేమిటి పిన్నీ. నేనేం పోరా యివాడ్నా. నాకింత మర్యాదేమిటి? నువ్వసలు క్రింద పడుకోకూడదు. ఏపురుగే నా ప్రాకితే...అసలే- వాడు ఏడుస్తున్నాడు కూడాను" కాంతారావు లేచి మంచినీళ్లు త్రాగి బొగడచెట్టునీడను నుంచున్నాడు. కస్తూరి లేచి వెళ్లి యిదివరకు కాంతారావుకు వేసిన పక్కమీద పిల్లవాడ్ని పడుకో

చెట్టి-తలగడా అందిచ్చి 'నే నిక పడుకోనా వాయనా' అంది.

'కప్పుకు నేందుకేదన్నా పల్చటికండువా యిచ్చి పో పిన్నీ. చలికూడాను.' అన్నాడు కాంతారావు. కస్తూరి దొడ్లో దండెన వుతికి ఆరవేసిన గ్లాస్గోవాయిలుచీర తెచ్చి యివ్వగా తలదాకా ముసుగుదన్ని కాంతారావు పడకేశాడు.

౬

పాలన్నీ నేలమీద పారబోసినట్లుగా పరుచుకున్న వెన్నెట్లో బొగడచెట్టుక్రింద రాలిన బొగడపూలతావిలో కాంతారావు ఏ సుఖస్వప్నాలు కంటున్నాడో ఎవ్వరూహించగలరు? చలిగాలి తిరిగింది. రెండుమూడుసార్లు రివ్వుమంటూ వీచింది. బొగడపూలు టపటపా చప్పుడు చేసుకుంటూ రాల్తున్నాయి. ఆ వెన్నెట్లో చూడటానికి కాంతారావు గ్లాస్కో పువ్వుల వాయిలుచీర ముసుగులో అచ్చంగా పవిట ముఖందాకా కప్పుకుని నిద్రపోతున్న అందమైన అమ్మాయిలా భ్రాంతికలిగించేలాగున్నాడు.

కస్తూరికూడా నిద్రపోయింది. బామ్మగారి గుర్రు గట్టిగా వినిపిస్తోంది. కనకం మంచంమీద ఓ నిద్ర తీసి బద్ధకంగా లేచి కూర్చొని మంచినీళ్లు ఎక్కడ వున్నవా అని నాలుగుమూలలూ చూసి మరచెంబు దగ్గరకు వెళ్లి గుక్కెడు నీళ్లు త్రాగి జోగుతూ మంచంమీద వాలింది. కాని అప్పటికే చలిగాలి తిరగటంవలన పక్కదుప్పటి లాగి కప్పుకుందామనుకుంది కాని అది పట్టి బొంత కావటంవలన దుప్పటి చిక్కలేదు. 'అక్కయ్యా నిద్ర పట్టేం దేవిటే?' అని బొగడచెట్టునీడను వాయిలు చీర చుట్టుకున్న మానవాకారాన్ని ప్రశ్నించింది. సమాధానం రాలేదు, 'నిద్రా-' అంటూ లేచి వెళ్లి చాపమీద యిదివరకు కస్తూరి పడుకున్న చోట కూర్చుని చెట్టుమండి రాలిన బొగడపూలన్నీ దోసెటితో ఎత్తి— 'ఎంత మంచిచోటు చూసుకున్నావమ్మా - యింత కమ్మటి వాసనేస్తూంటే హాయిగా వొత్తిగిలి నిద్రపోతున్నావా?' అంటూ వాయిలుచీర కట్టుకున్నట్లు కనపడుతున్న మానవాకారాన్ని చేతితో పొడుస్తూ 'కొంచెం ప్రక్కకు పొత్తిగిలు. నాకక్కడ చలిగా వుంది.' అంటూ కాంతారావు నానుకుని ఆ చాపమీద ప్రక్కనే పడుకుని ఒకచేయి కాంతారావుమీద వాలిన బొగడపూలేర్నుతూ కళ్ళు మూసుకుంది. మరో అర్ధగంట సాగేసరికి కాంతారావుకు తనప్రక్క నెవరో వచ్చి పడుకున్నట్లు అనుమానం తట్టింది. బాబయ్యేమోనని ప్రక్కకు పొత్తిగిలి తన తలక్రింద నున్న దిండు ఎత్తి కనకంతలక్రింద కుపుంచబోయాడు. కాంతారావు బొటనవ్రేలు కనకం జడపాయలో యిరుక్కుపోగా ముఖంమీది ముసుగొత్తిగించుకొని చూచాడు. అతనిగుండె గబగబా కొట్టుకోసాగింది. బాబయ్య కాదు. పల్లకాదూ కాదు. ఇదేమిటి కనక మిట్లా వచ్చి పడుకుంది! కాంతారావు లేపుదామనుకున్నాడు. కనకం అని వుచ్చరించబోతే నాలుక పిడచగట్టుకుని నోట మాట పెగిలి రాలేదు. వెంటనే తలమీదకు వాయిలుచీర ముసుగు బాగా లాక్కుని ఆ అమ్మాయిని ముట్టుకోకుండా ప్రక్కకు వొత్తిగిలి ముడిచిపెట్టుకుని భయపడుతూ పడున్నాడు. తిరిగి చలిగాలి రివ్వుమంటూ వీచింది. కాంతారావు బొగడపూలు మీదిమీదికి రాల్తున్నాయి. వాయిలుచీర వుల్లిపొరముసుగులోంచి ఆకాశాన్ని పరికించాడు. అంతా చాందినీ పూసినట్లు గులాబులు పాదరసపు బుడ్లు కట్టినట్టుగా నక్షత్రాలు చంద్రుడూ మిలమిల లాడ్తున్నాయి. గట్టిగా పెదిమ కొరుక్కుని భయాన్ని సిగ్గుని దూరంగా నెట్టి ముసుగు తొలిగించి తల పెనక్కుత్రిప్పి కనకంముఖం కేసి చూశాడు. గట్టిగా రెండుకళ్లూ మూసుగుని తెరిచి మరీ చూశాడు కలేమో అన్న భ్రాంతితో.

౭

"కాదుసుమా కల కాదుసుమా" అనిపించింది వెంటనే. పెదిమలు బిగబట్టి అట్లా ఆమెముఖంలోకి చూస్తూ ఆమెకేసే తిరిగి పడుకున్నాడు.

దూరాన నల్లటిమబ్బు తెరలో చిక్కుకుపోయాడు చందమామ. పావుగంట పదినిమిషాలదాకా ఆ నల్లటి మబ్బులోనుంచి రేరాజూ రాడు-రేయెండా కాయదు. కాంతారావు తనచేత్తో మృదువుగా కనకంశిరోజాల్ని తాకాడు.

పాప మాకిల్ల నిద్రపోతూనే వున్నది. కాని కాంతారావుక నిద్రపట్టలేదు.

చిన్నపిల్లవాడిచేతిలో రూపాయి వుంచగా ఎట్లా ఖర్చుచెయ్యాలో తెలీక తికమకలు పడ్డట్లు-యింక ఆ అమ్మాయిని లేపి 'ఇదేమిటే కనకం-వెళ్లి నీ పక్కమీద పడుకో-' అని చెప్పాలో మెదలకుండా వూరుకోవాలా లేక తను లేచి అన్నగారి మంచంమీదకు వెళ్ళి పడుకోవాలో ఏది చెయ్యాలో బోధపడలేదు.

కోర్కెలు ముసురుకవస్తున్నాయి. కనకంముఖంలోకి చూశాడు. ఆమెనిద్రలో ఏ స్వప్నంలో విహరిస్తున్నదో ఏమో పెదవులు మెదల్తున్నాయి. చిరునవ్వురేఖ ఉదయిస్తున్నది.

ఆమెముఖావలోకనంలో మగ్నమైన అతని కళ్లమీదకు కునుకు వాగురల్లే వస్తోంది. ఆమె కొద్దిగా కదిలింది. చందమామవెలుగు పూర్తిగా ఇప్పుడు ఆమెముఖంమీద ప్రసారిత మాతోంది. సుషుప్తిలో ఆమె కే సందేశమందిందో ఇంతలోకే ఆమె హటాత్తుగా కళ్లు విచ్చింది. ఎవరో ఆమెప్రక్కనున్నట్లు ఆమెకు తోచింది. నిజంగా ఆమె కనకం కాబట్టి భయపడి అమ్మ బాబోయ్ అని గొంతకుండా మెల్లగా లేచి కూచొని పరికించింది.

కాంతారావుని గుర్తుపట్టలేదు. కాంతారావు నవ్వుతూ 'నువ్వు నాదగ్గర కెందుకొచ్చావు.' ఇంత దొంగవేషమూ- 'సన్నగా పసపసల భాషలో అన్నాడు.

కనకం- 'ఎవరూ?' అంది పెదిమలను వంకరదీస్తూ.

'నేను కాంతారావుని- నువ్వు నా దగ్గర కొచ్చావెందుకు?' కనకం అమాంతం లేచి నిలబడింది. నెమ్మదిగానే, ఇదేమిటి ఇక్కడ కస్తూరికదూ ప్రక్క వేసుగున్నది?' అంది నమ్మలేకుండా. 'కాదు.మా పిన్ని నా మంచంమీద పడుకోమని నేను స్వార్థత్యాగం చేశాను.'

'మరి నువ్వీ చీర ఎందుకు కప్పుకున్నావు?'

'ఈ చీరా-నాకు చలి వేస్తే మా పిన్ని యిచ్చింది.'

మరి వాళ్లిద్దరూ మాట్లాడలేదు. కనకం

అక్కడే కూలబడింది. బోట బోటా కన్నీరు కార్చేస్తోంది. కాంతారావు 'వెళ్ళి పడుకో నీ ప్రక్కమీద' అని చాపమీద వొత్తిగిలాడు. కనకం జాలిగా అడిగింది. "కాంతం మరి నువ్వు నన్ను లేపి నా ప్రక్కమీదకు పొమ్మనకపోయావా? ఇంత వరకూ—" ముత్యాలకుమల్లే కళ్ళవెంట నీళ్ళు బొటబొటా కారుతున్నాయి. 'పోట్టు. కనకం – యిది నేను అజన్మాంతం ఎవరికీ చెప్పను' అన్నాడు కాంతారావు ఆమె చేతిలో చేయి వేస్తూ.

అంతే – కనకం వెళ్ళిపోయింది. ఆ రాత్రి కాంతారావూ నిద్రపోలేదు కనకమూ నిద్రపోలేదు.

ఒంటిగంటన్నర దాటాక ధర్మారావు వచ్చి కస్తూరీ అంటూ తలుపు తట్టాడు. మేలుకున్నవాళ్ళిద్దరూ ఎక్కడ దొంగతనం బయటపడుతుందో అని మాట్లాడలేదు. కస్తూరి కొంతసేపటికి లేచి వెళ్ళి తలుపు తీసింది. ధర్మారావు వచ్చి మంచం మీద వ్రాలాడు. కస్తూరి మంచినీళ్ళు యిచ్చాక త్రాగాడు. కస్తూరి పడుకోలేదు. కాళ్ళ కాటి దిక్కున కూర్చుని పాదాలమీద తలకాయ మోపి ఏడుస్తూ కూర్చుంది.

కాంతారావనుకున్నాడుగదా 'పిన్నికి ఏదో పీడకల వచ్చి భయపడివుంటుంది. బాబాయి రాగానే వొక్కదాన్ని చేసి యింత రాత్రివేళ సినిమాకు వెళ్ళకపోతే ఏమని కోపం కొద్దీ ఉడుకుమోతుతనం వచ్చిందేమో' అని. అప్పుడే కళ్ళనీళ్ళు తుడుచుకుని ప్రక్కకొత్తగిలి మేలుకుని ఉన్న కనకం మనస్సులో యిట్లా వూహించింది.

'బహుశా యీయన యీవిడ తగూలాడుకున్నారు కాబోలు. పగలు భార్యాభర్తల్లా వుండి రాత్రి వైరాలు సాగించుకుంటున్నారు.' అని.

అసలు కస్తూరి మనస్సులో యిట్లా వూహించింది.

'నేను పదహారేళ్ళకే వడిలిపోయాను. అదీ గాక ఆయన్ని ఏ రంభ వలచిందో... దాన్ని వదిలి రాలేకపోతున్నారు. నా సంసారంలో నిప్పులు పోస్తున్న ఆ రాక్షసి ఎవరా?' అని. అట్లా మథనపడి చివరకు మారుణాస్త్రప్రయోగం చేసింది.

ధర్మారావు లేచి కూర్చుని కాళ్ళు వెనక్కు లాక్కుంటూ – 'కస్తూరీ!' అని తీక్ష్ణంగా పిలిచి—

'నన్ను నిద్రపోనియ్యవూ?' అని ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

కస్తూరి కళ్ళనీళ్ళు చెంగుతో తుడుచుకుంటూ మడతమంచంమీదనుంచి లేవబోయింది.

ధర్మారావు రెక్క పుచ్చుకుని లాగి కస్తూరిని ప్రక్కన కూర్చోబెట్టుకుని 'ఏడుస్తున్నావా? ఎందుకు?' అన్నాడు.

'ఏదొచ్చినా యింతే–' అని ఆగి, 'రాత్రిళ్ళు మీరు ఎక్కడికీ వెళ్ళకండీ–' అని అతని విశాలవక్షస్థలానికేసి చూసి తలవంచింది.

'వెళ్ళకపోతే – ఎట్లా – వెళ్ళాలి కస్తూరీ!'

'ఇంకా రహస్యమేనా?'

ధర్మారావు కొద్దిగా నవ్వి – మూడు కొట్లలో నేను రాత్రిళ్ళు పద్దులు వ్రాస్తున్నాను. మూడు ముప్పైలు తొంభై–అదనపు రాబడి. ఇహ అప్పులన్నీ కొంతమట్టుకు తీరుతాయ్. వాక్యం పూర్తి గాకుండానే కస్తూరి అతనిమీద పూర్తిగా వ్రాలిపోయింది.

చాలా సహజంగా తెల్లవారింది.

అందరికన్నా ముసలమ్మగారు ముందు లేచారు.

కాంతారావు లేచీలేవటంతోటే వీధిలోకి పోయాడు. మళ్ళీ ఎనిమిదిగంటలకు కాఫీవేళకు వచ్చి వ్రాలాడు.

'మామ్మగారినీ, కనకాన్నీ బండీ ఎక్కించి రారా చంటీ' అని పురమాయించాడు ధర్మారావు.

కనకం ఏమీ జరగనట్టూ అన్నీ మర్చిపోయినట్టూ లేచింది. శుభ్రంగా తెల్లటిచీర కట్టుకుని కస్తూరి బలవంతాన తురిమిన మల్లెచెండు తలలో తారుణ్యప్రశోభలు విరజిమ్ముతూండగా రైలుపెట్టెలో కిటికీదగ్గర కూర్చుని దూరాన గుడ్లలో నీరు గుక్కుకుంటూ నిలబడ్డ కాంతారావు నుద్దేశించి చేయి వూపింది. కాంతారావు "నన్ను మర్చిపోవుగదూ!" అని అడుగుదామనుకొన్నాడు కాని అడగలేదు.



హరిద్వారములోని ఈశ్వరుడు

# కాల్పనిక జగత్తు

(19-వ పేజీ తరువాయి)

అమల యిలానే ఆలోచిస్తూ వుంటుంది. తన భర్త తిండి తిప్పలు చూసే యంత్రం గాని, సాధనంగాని కారాదు. అతని గౌరవానికి తను అభిమానపడాలి. ప్రజలకి భర్తని పరిచయం చేసేటప్పుడు, తన మోము ఉజ్వలం కావాలి!

వివాహవిషయంలో ఎక్కడ బోల్తా పడుతుందో ననే భయంతో ఎప్పుడూ చుట్టపక్కాలతో బాగా కలిసిమెలిసి తిరుగుతూ, వాళ్ల మనస్సులోని విషయాన్ని గ్రహించటానికి ప్రయత్నిస్తూవుంది. తరచు పేము గొడుగు చేత పట్టుకుని, యెవరి యింటికయినా వెళ్లుతూంటుంది. అక్కడ చర్చ సాగించి, వారి అంతర్యం గ్రహించడానికి యత్నిస్తుంది. కాని చిత్ర మేమిటంటే, యెవరి భర్తా ఆమెకి నచ్చలేదు. వాళ్లందరికంటె తన భర్త అన్ని విధాలా గొప్పగా వుండాలి!

ఒకరోజు అమల తల్లి వచ్చి- "అమలా, అత్తాయిగారు ఆడబిడ్డ మరిది సంబంధం వొకటి వచ్చింది. అతను పుస్తకాలు రాస్తాడట. అందంగాకూడా వుంటాడట. అతని పేరు వింటేనే, నువ్వు వొప్పుకుంటావని చెపుతుంది అత్తాయి....నువు సోమనాథరాయ్ పుస్తకా లేమీ చదవలా అమలా?" అన్నది.

సోమనాథరాయ్! హఠాత్తుగా అమల హృదయం దడదడ మన్నది. వారితో పెళ్లా! ఇది జరుగుతుందా? వారి నవలల్లోని కొన్ని పేజీలు తనకి కంఠోపాఠం! క్లాసులో పాఠ్యగ్రంథాల మధ్య దాచి వారి నవలలు యెన్నిసార్లు చదవలేదు? ఆధునిక రచయితల్లో వారి రచనలంటేనే, ఆమెకి యిష్టం! వారికి స్త్రీలమీద తీవ్రమయిన ద్వేష ముంది. కాని వారి రచనలు యెంత రసవత్తరంగా వుంటవి! వారి పుస్తకాలు యెన్ని సార్లు చదివినా మళ్లీ చదవా లనిపిస్తుంది.

వారు రచనల్లో స్త్రీలను యింతకటువుగా విమర్శిస్తారే! అది యెలా సహించడం? స్త్రీలమీద తీవ్రమయిన ద్వేష మున్న వ్యక్తి, వివాహం దేనికి చేసుకుంటున్నట్టు? ఒకవేళ ఇదంతా క్షేపజమేమో—లక్ష్యంకాని వస్తువుకోసం తపస్సేమో! అయితే దీన్ని విరోధభక్తి అని చెప్పవచ్చు!

'వాణి' లో అమల వారి ఫోటో చూసింది. వారి విస్ఫారిత నేత్రాల్లో యెంత ఔద్ధత్యం వుంది. ఇవాళ ఆ నేత్రాలే ఆమెకి గుర్తు కొస్తున్నవి.

ఆమె లోలోపల అనుకునేది—తేజస్సు, ఔద్ధత్యము లేని వ్యక్తి పురుషు డెలా అవుతాడు? తేజోవిహీన మయిన పురుషుని వంక, తను కన్నెత్తికూడా చూడదు.

మరుచటిరోజు పొద్దున్నే లేచి, తల్లి వద్దకు వెళ్లి వివాహానికి తన సమ్మతి తెలియపరిచింది.

అమల పెళ్లినాడు చుట్టపక్కాల్ని, స్నేహితుల్ని అందర్నీ పిలిచింది. తను యింత గొప్ప పండితుణ్ణి పెళ్లాడుతున్నానని చూపించటమే ఆమె ముఖ్యోద్దేశం! సంతోషంతో, మందహాసంతో ఆమె మోము ప్రకాశిస్తూవుంది. అందరూ వచ్చారో లేదో నని ఒకసారి వోరగా చూసింది. పెళ్లికి వచ్చినవారిలో కొంతమంది సోమనాథ్ ఆటోగ్రాఫ్ తీసుకోవటం చూసి, ఆమె హృదయం ఆనందంతో పుప్పొంగుతూ వుంది.

వివాహం కాగానే పూరీ వెళ్లారు. ముందుగానే అక్కడ మంచి హోటల్లో గది వొకటి కుదుర్చుకొన్నారు. భర్తతో కలిసి ప్రయాణం చేయటంలో యెంత ఆనందం వుంది! ఇంత గొప్పరచయితభార్య అయినందుకు, ప్రజలు తనను ఆదరంగా చూస్తారు. వారు తనను వెంటపెట్టుకుని సభలకు, విందులకు వెళ్లినప్పుడు, మనస్సు యెలా సంతోషంతో తేలియాడుతుందో నని వూహించుకుంటూ వుంటే, అమల గగుర్పాటు చెందుతూవుంది.

కాని పూరీ వెళ్లినాక, అమల హతాశురాలయింది. సరిగా ఆసమయంలో పూరీలో ఉత్సవం జరుగుతుంది. జనం కిటకిటలాడుతున్నారు. వీరిని పలకరించినవాళ్లు గాని, మర్యాద చేసినవాళ్లు గాని యెవరూ లేరు. ఇక్కడ సోమనాథ్ పుస్తకాలు చదివిన వాళ్లు యెవరూ లేరా? కనీసం వారి పేరైనా యెవరూ వినివుండలేదా?

ఇద్దరూ సముద్రంవొడ్డున నిలబడి వున్నప్పుడు, ప్రజలు వారివంక చూస్తుంటే, అమలహృదయం దడదడ కొట్టుకునేది. వారు సోమనాథ్ ని గుర్తుపట్టి, నమస్కరించి, తమవద్దకి వస్తున్నారనుకునేది. దారిని పోతూ పక్కవాళ్లు తమని గురించే, గుసగుస లాడుతున్నా రని వూహించుకునేది. ఎవరో సోమనాథ్ ని గుర్తించి, పక్కవాడితో చాలా మెల్లిగా 'అడుగో, ప్రసిద్ధ రచయిత సోమనాథ్, అతని భార్య' అని చెపుతున్నట్టుగా వుండేది. కాని, ఇదంతా శుద్ధకల్పనే! వారితో మాట్లాడటానికి యెవరూ రాలేదు. కనీసం పోట్లాడటానికికూడా రాలేదు!

ఒక వారం యిలానే గడిచిపోయింది. అప్పుడు అమల తనే అందర్నీ పలకరించ సాగింది; భర్తని గురించి పరిచయ వాక్యాలు చెప్పి—"వారు వ్రాసిన 'గర్విత ధాత్రి' మీరు చదవలేదా? సంవత్సరంలో మూడు ఎడిషన్లు వచ్చినయ్!" అనేది. కాని అమల యెవరివద్దకి వెళ్లియిదంతా చెప్పేకో, వారు లజ్జాభావంతో నవ్వి—"లేదండీ...మంచిది మీరు యిక్కడ యింకా యెన్నాళ్లు వుంటారు? భువనేశ్వరం వెళ్లరా?" అనేవాళ్లు. అమల కాసేపు వూరుకుని, ముఖం తిప్పి—"వెళ్లము" అని జవాబిచ్చేది!

ఇంత అనాగరికులవద్ద ఇంక ఆశించ తగ్గది యేముంటుంది? అమలకి తనమీద అంతులేని జాలి అక్షేపానం కలిగినాయి.



బెంగాల్ సహాయనిధి వసూళ్లు-అధ్యక్షులు రాజేంద్రప్రసాద్ గారి వద్ద విరాళం వసూలు చేసేముందు ఆయన షేర్వాణీమీద జాతీయపతాకాన్ని గ్రుచ్చుతున్న శ్రీమతి కె. పి. యస్. మీనన్.

ఆవాళే అమల సోమనాథ్ వద్దకు వెళ్ళి – "పదండి, రేపే యిక్కడినించి వెళ్ళిపోదాము" అంది.

సోమనాథ్ ఆమెమనస్సులోని విషయాన్ని గ్రహించలేదు. "ఇటువంటి అందమయిన ప్రదేశం వదిలి, వెళ్ళాలంటున్నావేం? నాకు ఇప్పుడప్పుడే వెళ్ళాలని లేదు. రాత్రింబవళ్ళు యీ అనంతజలధి వంక చూస్తూ కూచోవాలనిపిస్తూంది."

అమల కొంచెం ఆలోచించి—నాకూ యీ ప్రదేశం బాగానే వుంది. కాని యింకా యితరస్థలాలకి కూడా వెళ్ళాలిగదా?" అంది.

రాత్రికి వారిద్దరూ హోటలుకు తిరిగి వచ్చేటప్పటికి, ఇద్దరు యువకులు యెదురు చూస్తూవున్నారు. మర్నాడు సాయంకాలం గ్రంథాలయంలో సాహిత్యసభ యేర్పాటుచేశారు. దానికి అధ్యక్షత వహించవలసినదని సోమనాథ్‌ని కోరారు. అమల నేత్రాలు ఆనందంతో తళతళ మెరుస్తున్నవి. ఆయువకులు వెళ్ళేటప్పుడు, ఆమెని కూడా ఆహ్వానించారు.

మరుసటిరోజు సరిగ్గా యేడుగంటలకి సభ ప్రారంభ మవుతుంది. అమల అయిదు గంటలనించే టాయిలెట్ చేసుకోవటం మొదలెట్టింది. సభకి బాగానే జనం వస్తారు. ఫలానా వారి భార్య అని తెలుసుకుని, అందరూ తనవంక చూస్తారు. అందువల్ల చక్కగా అలంకరించుకునే వెళ్ళాలి. అదీగాక ఇప్పుడు తనకే వొక స్థాయి ఏర్పడింది! వారిని తీసుకెళ్ళటానికి యథాసమయానికి కారు వచ్చింది.

అమల అక్కడికి వెళ్ళినాక, చాలా ఆశ్చర్యపోయింది. వారు లోపలికి వెళ్ళటానికి యెటు చూసినా సందు లేదు. చివరికి వెనకవాకిలిగుండా పోయి వేదికమీద కూచున్నారు. హాల్లో ఖాళీలేక కిటికీ చువ్వలుకూడా పట్టుకు నిలబడ్డారు జనం. ఒక రచయితని సన్మానించటానికి ఇంత ప్రజానీకం వచ్చినందుకు, అమలహృదయం అహంకారపూరిత మయింది.

సరిగ్గా యేడింటికి సభాకార్యక్రమం ప్రారంభిద్దా మనుకుని, ఆర్గనైజరుతో— "ఇంకా ఆలస్యం దేనికి?" అన్నాడు సోమనాథ్.

అతను సవినయంగా—"ప్రార్థన చేయటానికి సుప్రసిద్ధసినిమానటుడు మజుమ్‌దారుకోసం మనిషి వెళ్ళాడు. వారు రాగానే ప్రారంభించుదాము" అన్నాడు.

పది పదిహేనునిమిషాలకి "కారుహారన్ వినపడింది. వెంటనే జనంలో కలవరం బయలుదేరింది. నవీనమజుమ్‌దారు భార్యాసమేతంగా హాల్లో అడుగు పెట్టగానే కరతాళధ్వనులతో హాలు ప్రతిధ్వనించిపోయింది.

అమల దీనికి యేదోవొకవిధంగా ఫీలయింది. తనూ, భర్తతో కలిసి హాల్లో ప్రవేశించినప్పుడు, చప్పట్లు చరిచారుకాని ఇలా గట్టిగా, వుత్సాహంగా యెవరూ చప్పట్లు కొట్టలేదు. కరతాళధ్వనులు శాంతించగానే అమల వోరగా తన పక్కన కూచున్న మజుమ్‌దారుభార్య కట్టుకున్న జార్జెట్ చీరె వంక చూసింది.

సభ ప్రారంభ మయింది. నవీన మజుమ్‌దారు ప్రార్థన చేయసాగాడు, జనప్రీతిని పొందిన తన సినిమాపాటలు కూడా కొన్ని పాడాడు. జనం మళ్ళీ చప్పట్లు చరిచారు.

బహుజనుల కోరికమీద యింకా రెండు పాటలు పాడాడు. చివరికి ఆయన లేచి నిలబడి నమస్కరించి—"నాకు యిక టైము లేదు. సినిమాలో వొక యెంగేజిమెంటు వుంది. ఇందుకు మీరందరూ నన్ను మన్నించమని కోరుతున్నా"నని చెప్పి భార్యాసమేతంగా సెలవు తీసుకోగానే, సభలో పెద్ద కలకలం బయలుదేరింది.

"దయయుంచి, మీరందరూ శాంతంగా వుండవలసింది." అని ఆర్గనైజరు విజ్ఞప్తి చేశాడు. కాని అతనిమాట ఎవ రాలకిస్తారు? అయిదు నిమిషాల్లో హాలంతా ఖాళీ అయిపోయింది. అంతా నెట్టుకుంటూ పోయి, మజుమ్‌దారు కారుచుట్టూ చేరారు.

చివరకి మిగిలిన శ్రోతలతోనే సభాకార్యక్రమం సాగించారు. సోమనాథ్ అధ్యక్షోపన్యాసం చేసి కూచునేప్పటికి, యెదురుగా బెంచీలమీద పిల్లకాయలు వృద్ధులు మాత్రం మిగిలివున్నారు.

సభాంతాన ఆర్గనైజరు, సోమనాథ్‌కి వారిభార్యకి ధన్యవాదా లర్పిస్తుంటే, అమల స్తబ్ధుగా కూచునివుంది. ఆమె యెటూ కన్నెత్తి చూడలేదు. వొంట్లో బాగాలేదని చెప్పింది.

"అయితే కొంచెం టీ అయినా తీసుకోండి" అని వొకతను టీ తీసుకొచ్చి ముందు పెట్టాడు.

అమలకు టీ కూడా అరుచిగానేవుంది. రెండు గుక్కలు తాగి టీ కిందపెట్టి జేబురుమాలుతో మూతి తుడుచుకుంది.

కారులో హోటలుకి తిరిగివచ్చేటప్పటికి బాగా పొద్దుపోయింది. రోడ్డుమీద జనసంచారం లేదు. రోడ్డుకి రెండువైపులా వున్న పెద్ద పెద్ద చెట్లు రాక్షసుల మాదిరి తలలు వంచుకుని నిలబడివున్నవి. దూరంగా సముద్రగర్జన వినిపిస్తూవుంది. ఆ భయంకర వాతావరణంలో కారు వేగంగా పోతూవుంది.

అమల నిశ్శబ్దంగా కూచునివుంది. ఆమె ముఖాన కఠోరత కాన్పిస్తూవుంది.

సోమనాథ్ మాట్లాడించటానికి ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. అమల ధ్యానమగ్నవలె, స్తబ్ధుగా నిశ్చలంగా వుంది.

కారుదిగి, హోటల్లోకి వెళ్ళినాక– "ఫలహారం యేమీ తీసుకోలే దేం?" అన్నాడు సోమనాథ్.

అమల యేమీ జవాబివ్వలేదు. మౌనంగా వుంది.

సోమనాథ్ కొంచెం ఆగి, మళ్ళీ – "ఫలహారం ఫస్టుగా వుంది. ఇక్కడి తీపి –చమ్‌చమ్ – మంచి ప్రసిద్ధి!" అన్నాడు.

అమల అప్పటికీ మౌనంగా వుండటం చూసి – "ఏమిటి అలా వున్నావు అమలా?" అన్నాడు సోమనాథ్.

"ఏమో"

"కాదు చెప్పు! యెందుకు నువ్వింత గంభీరంగా వుంటున్నావు?"

అమలకళ్ళెదుట, అప్పుడు హాసోజ్వలమయిన నవీనమజుమ్‌దారుభార్య ముఖం ప్రత్యక్షమయింది. ఇవాళ తనకంటె అదృష్టవంతురాలు యెవరూ లేనట్టు, గర్వంతో, అహంకారంతో ఆమెకి కాళ్ళు నేలమీద ఆనటం లేదు.

సోమనాథ్ మళ్ళీ అడిగాడు—ఏమి జరిగిందో చెప్పు రాణీ!"

ఈసారి అమల విసుక్కుని – "నాకు తెలియదు. దయయుంచి నన్ను పలకరించమాకండి" అంది.

సోమనాథ్‌కి యేమీ అర్థంకాక, మెదలకుండా వూరుకున్నాడు. అమల దీర్ఘంగా నిట్టూర్చింది. అమల ఆ సమయాన కూడా నవీనమజుమ్‌దార్ భార్య అదృష్టాన్ని గురించి యోచిస్తూవుంది.

---

# పట్నవాసపు మర్యాద

(15 వ పేజీ తరువాయి)

యజ : వంటయిల్లుకాక మరొకగదీ నీళ్ల గదీ ఉన్నాయి. ముప్ఫయి రూపాయలకు ఇచ్చివేసినాను.

కేశ: మా స్నేహితుడు యింకొక అయిదు రూపాయలు ఎక్కువ యిస్తాడు. మీరు ఏ విధంగా నన్నా మార్చగలరా. చాలా ఇబ్బందిపడుతున్నాడు.

యజ : (బిగింపుగా) చూడండి. అట్లాంటి పనులు మావల్ల కావు. అద్దె కచ్చితంగా తీసుకోవటమే గాని, మాటతప్పటమూ-అది ఆశకుపోయి అబద్ధాలు ఆడటము నావల్ల కాదు. చూశారూ! డబ్బు పాపిష్టిది. అయినా నేను దానికి లొంగేవాడిని కాను.

కేశ : మా స్నేహితుడి ముఖము చూసి మీరేదయినా మార్గము చూడాలి. మీరు ఏ విధంగా నన్నా సహాయము చేయకపోతే అతనికి నిలువనీడ లేదనుకోండి.

యజ : ఏమంటున్నారు మీరు? నాకు మాట పోదూ-అండీ? వాళ్లకిచ్చినంత మొత్తానికే మీకు యిస్తే-చూడటానికి బాగుండదు. వాళ్లు విన్నా బాగుండదు. ఇంతకూ చూశారో లేదో-మీ కిస్తానన్న అయిదురూపాయలకూ మాట పోగొట్టుకోవటము నా కిష్టము లేదు సుమండి.

కేశ : మీ మనసులో ఉన్నమాట తేల్చి చెప్పండి.

యజ . మీరింతగా అడుగుతున్నారు కనక అంటున్నాను. మరో పదిహేను రూపాయలయినా ఇస్తేనేగాని...

కేశ : మరీ అంత అన్యాయమా? మాకై మేము వచ్చి అడిగినందుకా ఇంత హెచ్చు అద్దె? ఇంత నిర్దాక్షిణ్యమయితే ఎట్లాగండి.

యజ : (నవ్వుతూ) ఇంటివిలువ ఎట్లా ఉన్నదో చూస్తున్నారుగా! ఇందులో దయ ఏమిటి, దాక్షిణ్యమేమిటి?

కేశ : ప్రతి ఒక్కరు ఇంటిని ఖాళీచేసినప్పుడంతా అద్దెను యెక్కువచేస్తూనే ఉన్నారు అసలే ఖాళీచేయకపోతే ఏం చేస్తారు?

యజ : చూడండీ! నేను యింటి యజమానుని కనుక ఇల్లు ఇస్తా ననక పోయినా. మీరే యింటికొరకు నాదగ్గరకి వచ్చారు. మనము మాటలు పెంచుకొని ఘర్షణపడితే వ్యవహారము చెడుతుంది గాని మరేం లాభములేదు. ఇది ఒక వ్యాపారమనుకోండి. మేము ఉన్నదంతా ఇళ్ళ మీద పెట్టి, న్యాయాన్ని నమ్ముకుంటే బాగుపడ్డట్లే! వ్యాపారరహస్యాలు బోలెడున్నాయి ఇందులో. ఎవరినయినా ఇంట్లో నుంచి లేవగొట్టదలచుకుంటే న్యాయశాస్త్రరీత్యా మాకు సలహాలను ఇచ్చే వకీళ్లు చాలామంది ఉన్నారు. కొన్నాళ్లు అద్దె తీసుకోకపోవటమూ, అద్దె సరిగా యివ్వటములేదని ఫిర్యాదుచేయటమూ ఇట్లాంటివి చాలా ఉన్నాయి కనక ఆ మాటలన్నీ యిప్పుడు అనవసరము. మొక్క కుతెల తుంచుతున్నకొద్దీ చిగురు యెక్కువగా వస్తుంది చూశారూ! అట్లాగే ననుకోండి. ప్రభుత్వము ఇళ్ల అద్దెల నిరోధకశాసనము పెట్టారుగాని మేమూ అందులో బ్రతుకు తెరువు చూసుకోవాలిగాదండీ!

కేశ : మాధవరావ్! వింటున్నావా? ఏం చేయమంటావో చెప్పు. అవసరము కొద్దీ ఇప్పుడు మనము మాట్లాడాలి.

మాధ : నా కేమీ తోచటము లేదు. మీరంతా ఎట్లా చెప్తే అట్లా నడుచుకుంటాను.

కేశవ : సరే. మా స్నేహితుడు అంగీకరించాడండీ! ఎడ్వాన్సు అద్దె తీసుకొని రసీదు యివ్వండి.

యజ : అలాగే తీసుకోండి. రసీదు ఇవ్వటానికేమి అభ్యంతరము? ఆ భాగము కాస్త శుభ్రము చేయించి ఉంచుతాను. రేపే రండి ఎల్లుండే రండి మీ యిష్టమది అంతా. అయినా మీరు కాస్త మంచి రోజు చూసేవాళ్లే కదా!

## 4 వ రంగము

మాధ : కేశవరావ్. చూశావా? ఎంత పని జరిగిందో!

కేశ : ఏమిటేమిటి? ఇంటి మాటేనా నీవు చెప్పేది?

మాధ : ఆఁ యింటిమాటే. మొన్న మనము నిశ్చయించిన ఇంట్లో ప్రవేశించాలని వెళ్లాను. ఆ యింట్లో ఎవరో తిరుగుతున్నారు. లోపలికి వెళ్లి అడిగితే అందరూ 'మాకు తెలియదంటే - మాకు తెలియ' దంటున్నారు. నీవు కాస్త వచ్చి మాట్లాడి వెళ్తావా?

కేశవ : పద్దాము పద.

(అయిదు నిముషముల తరువాత)

కేశ : యజమాని ఉన్నారా యింట్లో? అబ్బాయీ! కాస్త లోపలికి వెళ్లి చెప్పమ్మా?

యజ : ఎవరు?... ఓహో! మీరా? రండి.

కేశ : మేమేనండి. మొన్న యింటికోరకు వచ్చి అద్దె ఎడ్వాన్సు యిచ్చినది మేమే. మా స్నేహితుడు యీ ఉదయమే ఇంట్లో ప్రవేశించా లనుకుంటున్నాడు.

యజ : చూడండి. మొన్న మీతో యింతా మాటయిచ్చి ఎడ్వాన్స తీసుకున్నానా? ఆ సాయంకాలమే మా పెద్ద బ్బాయి పిల్లలతో వచ్చి రెండు నెలలపాటు ఉంటానని ఉత్తరము వ్రాశాడు. నాకు చాలా విచారంగా ఉంది. పెద్దమనుష్యులకు మాట యిచ్చానుగదా అనికించగా ఉంది. ఏం చెయ్యను?

కేశవ : మీరు పెద్దమనుష్యులు ఇల్లు ఇస్తామంటే నమ్మాము. ఎడ్వాన్స తీసుకొని కూడా మాట తప్పితే మేము ఏమన గలము? మాట తప్పకుండా ఉండటము కొరకే ఈ అడ్వాన్సులూ-రసీములూను. ఈ కాలములో వాటి నమ్మకమూ లేనట్లున్నది.

యజ : ఆ మాటలన్నీ ఎందుకు? అప్పుడు వీలు వున్నది. కనుక ఇల్లు ఇస్తానన్నాను. ఇవాళ వీలులేకపోయింది. మీ అడ్వాన్సు రూపాయలు తీసుకొని వెళ్లండి. ఇందులో పెద్ద మీ నమ్మకమేమున్నది-నా అపనమ్మకమేమున్నది? ఇంతలోకే నేను పెద్దమనిషిని కాకపోయినానా? వ్యవహారము హెచ్చుతగ్గులయినా మర్యాదగా మాట్లాడాలండీ.

కేశ : అవునులెండి. వ్యవహారము బాగా తెలిసినవాళ్లు కనుక ఏకవచనప్రయోగము లేకుండా తియ్యటి మాటలతో మర్యాదగా మాట్లాడుతూనే ఉంటారు. ఇంతకూ మేమే వెర్రివాళ్లవలె మోసపోయినాము. మాకంటె ముందు ఎడ్వాన్సు యిచ్చిన వాళ్లను-మేము రాగానే కాదన్నారు. అట్లాగే ఇంకెవరి దగ్గరో ఎక్కువ డబ్బు తీసుకొని మమ్మల్ని లేదంటున్నారు. ఇది పట్నవాసపు న్యాయముగా ఉందే! సరే. అడ్వాన్సు అతనికి యిచ్చెయ్యండి. వెళ్ళిపోతాము. ఇంకెందుకు?

యజ : ఊం. తీసుకోండి. నేను ఈ విషయాలలో చాలా సాఫ్ - సీదా మనిషిని.

కేశ : రావోయి పోదాము.

మాధ : (విచారముతో) ఈ యిల్లు కుదురుతుందని ఎంతో ఆశపడ్డాను. వాసుదేవరావుగారింటి ఆడవాళ్లు తమ యింట్లో వీలులేదని చెప్పేశారు. ఇన్నాళ్లూ అభిమానము చంపుకొని వాళ్ల సూటీ పోటీ మాటలు లెక్కచేయకుండా ఉన్నాను. ఇప్పుడు ఆ కాస్తా వీలులేకుండా పోయింది. ఊళ్లో నా పిల్లలు నాకోరకు దిగులుపడ్డారట. ఇక్కడ నేను వాళ్లింట్లో అగచాట్లు పడ్డట్టే, నాభార్య అక్కడ నానాబాధలూ పడుతున్నదట. ఆమెకు జ్వరముకూడా వస్తున్నదట! ఇల్లు దొరికిందన్న సంతోషములో నాభార్యాపిల్లలను రమ్మని వ్రాశాను. నా కొక్కడికే నిలువనీడ లేదు. వాళ్లు ఎక్కడుంటారు? ఈ పట్నవాసాలలో తండ్రికి కొడుకు లేదు. కొడుకుకు తండ్రి లేదు. ఇక్కడ నిజాయతీ - ముఖమాటము-స్నేహమూ - ఏదీ లేదు. పైపై మెరుగులు. నాకిప్పుడే దారి చూపిస్తావోయి కేశవరావు?

కేశవ : చూదాంలే. నేను ఆఫీసుకి వెళ్లాలి. రేపటివరకూ ఏదో మార్గము చూద్దాంలే.

## 5 వ రంగము

జవాను : అయ్యా! వాసుదేవరావు గారూ!

వాసు : ఎవరు?

జవాను : నేను శ్రీనివాసరావుఇంజనీరు గారి జవాన్నండి. మా అయ్యగారు కారులో వస్తుంటే మాధవరావుగా రటండి...ఆయన కారుక్రింద పడ్డాడండి. బాగా దెబ్బలు తగిలాయండి. ఎవరయినా మీ వాళ్లున్నారా అంటే మీ పేరు చెప్పారటండి. మా అయ్యగారు మీదగ్గరికి వెళ్లి చెప్పిరమ్మన్నారండి. పాపము పెద్దదెబ్బే తగిలిందండి చెంప మీద.

వాసు : ఎప్పుడు తగిలింది దెబ్బ? మాట్లాడుతున్నాడా? అయ్యోపాపము! సుందరీ! విన్నావా? మన యింట్లో ఉన్న మాధవరావు కారుక్రింద పడ్డాడట. పెద్ద దెబ్బ తగిలిందట. ఏం చేద్దాము? నేను వెళ్లివస్తాను.

సుందరి : మీరు వెళ్లి ఏం చేస్తారు? దెబ్బ తగిలించిన ఇంజనీరే చూస్తాడులెండి.

వాసు : పాపం, ఈ కొత్తవూళ్లో అతనికెవ రున్నారు? నా పేరు చెప్పాడట. వెళ్లి చూసి వస్తాను.

సుందరి : అంతదూరమూ వెళ్లి ఆయన్ను మీరు చూసి ఊరికే రాగలరా? మళ్లీ మన యింటికే తీసుకొని వస్తారు. కళ్లతో చూస్తే మరీ ముఖమాటము. మీ కెందుకు ఇదంతా! ఆ ఇంజనీరే అంతా కనుక్కొని ధర్మాసుపత్రిలో చేరుస్తాడు లెండి. ఎవరి కెవరూ ఈ మహాపట్నములో?

[హైదరాబాదు ఆలిండియా రేడియో వారి సౌజన్యంతో]

# నాసిక్ కాంగ్రెస్ సమావేశ కర్తవ్యం

(16-వ పేజీ తరువాయి)

వేశ ప్రతినిధులపై భారమైన కర్తవ్యం పడింది. వాస్తవస్థితిగతులు చూసి జంకి, సావధానంగా నడవడమే వివేకమనీ అదే ప్రజలకు హితమనీ తలచి కేంద్రప్రభుత్వంలోనూ రాష్ట్ర ప్రభుత్వాలలోనూ మంత్రులు ఎటూ అడుగు వెయ్యలేకున్నారు. ప్రజలతో నిత్యం సన్నిహితంగా వారి భావాలను అవసరాలను ఆశలను గ్రహించగల స్థితిలో ఉండే కాంగ్రెస్ ప్రతినిధులు, ప్రజల కష్టాలను నివారించునట్లు కాంగ్రెస్ నాయకులు పరిపాలన సాగించేవిధంగా ఒత్తిడి తేవాలి. మహత్కార్యాలను సాధించలేక పోయినప్పటికీ, తాము చేస్తున్న కార్యాలు అన్నీ ప్రజల భవిష్యదభ్యుదయానికే ననే విషయాన్ని నాయకులు ప్రజలకు నిరూపించనట్లయితే కాంగ్రెస్ పతనమై అంతర్హితం కాగలదని ప్రతినిధులు ప్రభుత్వంలో ఉన్నవారికి తెలియపరచాలి.

## తక్షణావసరాలు *

సామాన్య ప్రజానీకం ఏ ఆర్థిక రాజకీయభారాలక్రింద పడి నలుగుతున్నారో ఆ భారాల్ని తొలగించడానికి మార్గాన్ని నాసిక్ కాంగ్రెస్ అన్వేషించాలి. రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక సాంఘిక సమస్యల్లో తక్షణపరిష్కారావశ్యకాలైన వానిని విధిగా పరిష్కరించితీరగలదని కాంగ్రెస్ దీక్షపూనినప్పుడే ప్రజలు ముందుకు వచ్చి అనేక ఇడుములు పడి స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నారు. అందువల్ల ఈనాడు మంత్రులు అధిగమించవలసిన రాజకీయ, పరిపాలనాసమస్యల్ని గురించి ప్రజ లాట్టే పట్టించుకోరు. ప్రజాస్వామ్యంలో అనుభవం, సాంప్రదాయం తెలియని మంత్రులు స్వాతంత్ర్యవ్యవస్థ ఆరంభదశలో పరిష్కరించవలసిన సమస్యలతో నిమిత్తంలేకనే ప్రజలు తాము కోరిన తక్షణావసరాలు తీరనందువల్ల వారి సహనశక్తి హద్దుమీరుతుంది. రాజకీయాల పంకిలానికి దూరంగా ఉన్న సామాన్యప్రజలకి స్వాతంత్ర్యవ్యవస్థ, అంతర్జాతీయప్రతిపత్తి మొదలైన గౌరవాలు కనిపించవు. వారికి స్వరాజ్యమంటే జీవనసదుపాయాల వృద్ధిలో కనిపించాలి. చెరువులు మరమ్మతు చెయ్యడానికీ నూతులు తవ్వించడానికీ కాలువలు వెయ్యడానికీ ధనంలేదని ప్రభుత్వం చెప్తున్నంతకాలం ప్రజలకి వ్యవసాయోత్పత్తివృద్ధి కార్యక్రమాలు, పారిశ్రామికాభివృద్ధి, విజ్ఞానపరిశోధనాది విషయాల ప్రసక్తి నిరుపయోగం. కమిటీలు, కమిషన్లు, తీర్మానాలు, ప్రణాళికలు, ప్రచారాలపైన ధనం దుర్వినియోగంచేసేబదులు ప్రభుత్వం స్వయంసమృద్ధత సాధించడానికి పల్లెవాసులకు తోడ్పడి పెద్ద ప్రాజెక్టులకికూడా ఆటంకం లేకుండా కొనసాగించవచ్చును. పలుకష్టాలు పడుతున్న ప్రజాకోటిని ఆర్థికంగా ఉద్ధరించి ప్రభుత్వాలపట్ల ప్రజల విశ్వాసం ఆర్జించడానికి ఇదే మార్గం.

## కమ్యూనిస్టు అరాచకం *

దేశంలో రాజకీయపరిస్థితినికూడా కాంగ్రెస్ జాగ్రత్తగా గమనించవలసిన అవసరం ఉంది. ప్రజాస్వామ్యనీతి ననుసరించి పరిపాలనాధికారాన్ని కాంగ్రెస్ వారి హస్తాలనుంచి లాక్కోగల రాజకీయపక్ష మేదీ ఈనాడు దేశంలో లేదు. కాని ఈనాడు కమ్యూనిస్టుముప్పు దేశంలో అత్యధికంగా ఉంది. దేశంలో కొన్నిప్రాంతాల ప్రజలకు ప్రాణభయం అధికంగా ఉంది. ప్రయాణీకులు రైలెక్కేముందు గమ్యస్థానానికి ఏప్రమాదం సంభవించకుండా క్షేమంగా చేరుకోడానికి ప్రార్థనలు చేస్తున్నారు. ఈమాదిరి ప్రాణభయం వ్యాప్తిచెందుతుంటే ప్రభుత్వంలో ప్రజల విశ్వాసం చలించకమానదు.

శాసనసభ్యుల్ని, మంత్రుల్ని, పరిపాలకుల్ని మార్చగల అధికారం తమ కున్నదని భారతీయులు గ్రహించారు. కాబట్టి ఈనాడు రాజకీయాల్లో ప్రత్యర్థుల్ని గెలవడం ప్రధానం కాదనీ, ప్రజల్లో విశ్వాసం పురిగొల్పడం కర్తవ్యమనీ కాంగ్రెస్ గ్రహించాలి. పరిపాలనావిధిద్వారా, శాంతిస్థాపనద్వారా ప్రభుత్వం ఈ విశ్వాసాన్ని పురిగొల్పగలగాలి. దేశంలో అశాంతికీ ప్రాణభయానికీ కల హేతువుల్ని నివారించడమే కాకుండా, అధోగతిలో ఉన్న పల్లెవాసులు కమ్యూనిజంవైపుకు ఎందుకు మొగ్గుతున్నారో గ్రహించాలి.

## ప్రజాసాన్నిహిత్యం *

ప్రజాస్వామ్యవ్యవస్థకీ కమ్యూనిస్టువ్యవస్థకీ ఏ అభ్యుదయకాంక్షులూ విరోధులు కారు. కాని కమ్యూనిస్టుదేశాల్లో చెలరేగే దౌర్జన్యాన్ని నూతనసామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించి నాశనం చేయాలి. కమ్యూనిస్టుపార్టీని నిషేధిస్తే ఉచ్చు కాంగ్రెస్ కే పడుతుంది. కమ్యూనిస్టుల్ని నిషేధానికి గురిచేసినట్లయితే వారు ప్రజలకు వీరులౌతారు. వివిధ కార్మిక సంఘాల్లోకి ప్రచ్ఛన్నంగా ప్రవేశించి లోలోన తొల్చివేస్తారు. కాబట్టి ప్రభుత్వం ప్రజల్ని ఆర్థికంగా ఉద్ధరించడమేకాకుండా కమ్యూనిస్టుల చర్యలవల్ల ఒనగూడుతున్న అపకారాన్ని ప్రచారంద్వారా బహిరంగపరచాలి. ఈపనికి దేశమంతా వ్యాపించిఉన్న కాంగ్రెస్ వాదులే తగినవారు. ప్రజల్లో విద్యావ్యాప్తికి, ప్రచారానికి, నాసిక్ సమావేశం మార్గాన్వేషణ చెయ్యవలసి ఉంటుంది.

నాసిక్ సమావేశం అనేక క్లిష్టసమస్యల పరిష్కారానికి యత్నించవలసి ఉంటుంది. మూడుకోట్ల సభ్యత్వబలం కల కాంగ్రెస్ కి ఇది కష్టం కాదు. పదిలక్షల అర్హతాసభ్యులు నడుముబిగించి స్వాతంత్ర్యసమరంలోవలె ప్రజల సన్నిధికి వెళ్లినట్లయితే కాంగ్రెస్ సాధించజాలని కార్యం ఉండదు. సేవాసక్తితో దేశంలో [illegible]స్థితుల్ని నెలకొల్పడమో, లేక ప్రమత్తతవల్ల చివరికి ఛిన్నాభిన్నం కావడమో కాంగ్రెస్ నాసిక్ లో నిర్ణయించుకోవాలి. ప్రజలకు వాస్తవప్రతినిధులైన కాంగ్రెస్ ప్రతినిధులు కర్తవ్యాన్ని గ్రహించి కాంగ్రెస్ సంస్థని కాపాడగలరో లేదో నాసిక్ సమావేశంలో చూడవలసిఉంది.

[నేషనల్ ప్రెస్ సిండికేట్]

# కొరియా యుద్ధం



సముద్రాంతరయుద్ధరంగాలకు పంపడానికి త్వరితగతిని సిద్ధపరచ బడుతున్న అమెరికన్ యుద్ధ విమానాలు





కొరియారణక్షేత్రంలో అమె రికన్ టాంకులు




పొహాంగ్‌లో అమెరికన్ సేన లకు దక్షిణకొరియాప్రజల స్వాగ తము

Regd No M 4479



Edited, Printed & Published by S Sambhu Prasad, at the Andhra Patrika Press 7 Thambu Chetty St, Madras